# చలాచలబోధ

ఓం

రచయిత

విజ్ఞాన స్వరూప్ కోసూరు మురళీకృష్ణారావు

చల్లపల్లి, కృష్ణాజిల్లా

ప్రతులు : 600

ముద్రణ : ఫిబ్రవరి 2011

వెల : అమూల్యం

ప్రతుల కొఱకు

కె. మురళీ కృష్ణారావు
డోర్. నెం. 13-52
అగ్రహారం, చల్లపల్లి (పోస్ట్)
కృష్ణా జిల్లా. 521 126
ఫోన్: (08671) 224516



హిమాలయ ఋషివర్యులు
**సంత్‌శ్రీ విశ్వాత్మ**



సద్గురుమూర్తి
**బ్రహ్మర్షి ముమ్మలనేని సుబ్బారాయార్యులు**



విజ్ఞాన స్వరూప్ కోసూరు మురళీకృష్ణారావు, సరోజ దంపతులు

# చలాచలబోధ

## విషయసూచిక

# ముందుమాట

శిష్యుని ప్రస్థానము తనకు తెలియకుండానే, తన కుటుంబ మరియు సమాజ వారసత్వముగా ప్రారంభమగును. కొందరిమాటలు వినును. కొన్ని గ్రంధములు చదువును. యధాలాపముగా జీవించును. తన ఆధ్యాత్మిక స్థితి తెలిసియుండదు. మారవలెనన్న ఆలోచనే రాదు. వచ్చినను, పట్టుదలగా తాను మారే ప్రయత్నము చేయదు. ఈవిధముగా సంక్రమించిన అభిప్రాయము కలిగియుండి, జీవవ్యాపారమన్ననేమో, దైవమన్ననేమో మరియు జీవదైవ సంబంధమెట్లున్నదో యెఱుగడు.

అందువలన అట్టిస్థితిలో నున్నవాడు శిష్యుడైనప్పుడు అతని శాస్త్రవాసనను విడచి, గురువు తాను నడిపిన విధముగా నడచుకొనుమని చెప్పును. జన్మతః ఒక మతమునకు సబంధించిన వాడు, తన మత పద్ధతికి విశ్వాసియై యుండును. అట్టి తరి, గురువు ఎవరైనను, తన శిష్యునికి బోధించునపుడు, ఇతర బోధలను వినవద్దనియు, ఇతర గ్రంధములు చదువ వద్దనియు ఆంక్షలు పెట్టును. గురుబోధను క్రమపద్ధతిలో, విచారణ పూర్వకముగా తెలుపుచు, గుర్వాజ్ఞను పాటించుమనును. సాధన పద్ధతి తెలిపి, క్రమముగా శిష్యుని మోక్షమార్గము వైపునకు నడిపించును.

సమర్థుడైన గురువు లభించినచో, అట్టి శిష్యునికి ఆ గురువును అనుసరించిన యెడల సరిపోవును. గురువు కొంతవరకే అనుభవజ్ఞుడైనచో, శిష్యుడు మరొక సమర్థ గురుని యొద్దకు వెళ్ళవచ్చును. కొందరు గురువులకు వారి స్థితి వారికి తెలిసియుండును. గనుక, శిష్యుడు తనకంటె మించియుండి ఆపై బోధకు తహ చెందినప్పుడు ఆ గురువే విహిత గరువు వద్దకు శిష్యుని ఫంపును. గురువు ఆ విధముగా పంపని యెడల, శిష్యుడు మొదటి గురువును గౌరవిస్తూనే మరియొక గురువును చేరవచ్చును.

అటులనే మరికొన్ని గ్రంథములు చదివి, తన సందేహములు తీర్చుకొనవచ్చును. మొదటే యితర గ్రంథములు చదివినచో శిష్యుడుఒక నిర్ణయమునకు రాలేడనియు, అతని పూర్వశాస్త్ర వాసన నుండి విడిపించవలెననియు గురువు ఆంక్షలు పెట్టుట సమంజసమే. కాని యిప్పుడు పై చదువులు చదువుచు, తన జ్ఞానమును పెంపు జేసుకొనుచు, సమన్వయము జేసికొనవచ్చును.

**శాస్త్ర ద్రష్టం। గురోర్వాక్యం।**
**తృతీయం ఆత్మ నిశ్చయం । చతుర్థం**
**సంశయచ్ఛేదం । పంచమం ముక్తి దాయకం ॥**

ఆత్మ నిశ్చయం నిస్సంశయముగా జరిగిననే గాని, ముక్తి కలుగదు. జనకుడు కూడా అనేకమంది పండితులతో గోష్టి జరుపుచు, అష్టా వక్రుని గురువుగా జేసికొనియు, మరల యాజ్ఞవల్క్యుని గురువుగా స్వీకరించెను. నిజ ప్రబోధ కొఱకు విచారణ పొడిగించుట తప్పులేదు.

ఒక మతపద్ధతిలోనే విచారించుట కూడా సంకుచితమే. అటులనే అన్య మతస్థుల భాష్యములు కూడా పునర్విచారణకు యోగ్యము. ఎందుకనగా మత మనగా అభిప్రాయము. కాని విచారణ మాత్రము వేద ప్రమాణముగానే చేయవలెను, భాష్యాలు, మతాలు ఎన్నైనా వేదము నిర్ణయించే జ్ఞానము ఒక్కటే అనగా మతములను తప్పు పట్టుట సరిగాదు, అవగాహనను పెంచుకొనుటకు మతము అడ్డుకారాదనియే భావము.

ప్రపంచములో దేశకాలములందున్న మానవ జాతియెక్క బుద్ధి వికాసము ననుసరించి అనేక మతములు పుట్టినవి. అయినను వాటి లక్ష్యం ఒక్కటే, గమ్యం ఒక్కటే. మత పద్ధతిలో నిర్దేశించిన సాధన మార్గములు మాత్రము విభిన్నము, మరియు కొంతవరకే పూర్ణము.

పతంజలి యోగ సూత్రాలు చిత్తవృత్తి నిరోధమే మోక్షమని ముగించినది. బౌద్ధ మతము నిర్విషయ సిద్ధిచే గలుగు నిర్వాణమే మోక్షమన్నది. అద్వైతులు బ్రహ్మ యొక్కటే, మిగిలినవన్నియు మనోకల్పితములని నిర్ణయించి, సహజ నిర్వికల్ప సమాధినే మోక్షమని తేల్చి.

మతములన్నియు మంచినే బోధించె,
తెలిసి మెలగ వలయు తెలివితోడ,
మతులు మంచివైన మతమేమి చెడ్డది.
అని శ్రీ సత్యసాయిబాబా వారన్నారు.

సత్యాన్వేషణ మాత్రము పరిపూర్ణ ముక్తి దొఱకు వరకు, మతాతీతముగా కొనసాగుచునే యుండవలెను. దారిలో తారసపడు అద్భుతములకును, అష్ట సిద్ధులకును, లేక యితరమైన మహత్తులకు లోబడరాదు లేక చిక్కుపడరాదు. గమ్యము చేరువరకు అటు యిటు చలించక, లక్ష్యమును విడువరాదు. మధ్యంతర లక్ష్యములు క్రొత్తగా నేర్పఱచిన యెడల మోస పోయెదరు.

బుద్ధుని హెచ్చరిక యీవిధముగానున్నది.
వినినంత మాత్రాన నమ్మకు దేనిని,
తరతరాలుగా వచ్చెనని నమ్మకు దేనిని,
పలువురు పలికిరని నమ్మకు దేనిని,
మత గ్రంథాలలో నున్నదని నమ్మకు దేనిని,
(కుహనా) గురువులు పెద్దల వాక్యమని నమ్మకు దేనిని,
కాని దేనినైనా స్వయముగా గమనించి, విశ్లేషించి,
అది సహేతుకమైనదై, సర్వులకు మంచి కల్గించునది,
లాభదాయకమైనదియై యున్నచో, దానిని స్వీకరించి, ఆచరించుము.

ముత్యాల నారసింహ యోగీంద్రులు, వారి విరచిత గ్రంథమైన "నిర్గుణాత్మ జ్ఞాన సంయోగము" అనియెడు "కందార్థ రత్నావళి" యందు ప్రబోధ నెఱపుచు.

గురిగుర్తు లేనివారిల। నరయంగ లేరెందు పరము
నమ్ము నామాట। ఇంగిత మెఱిగి పొమ్ము యీబాట

అని నుడివిరి. వరము గావలెనన్న యింగిత వెఱిగి యుండవలెనని సెలవిచ్చిరి

వేదాంత నిర్ణయమునే ఇంగిత జ్ఞానముతో నిష్పక్షపాతముగా విచారించి, మతపద్ధతి నధిగమించవలెను. దీనినే వేదాంతాతీత సిద్ధాంతమని యందురు.

ఈ విధముగా అద్వైత మతమును నిరసించకనే, మరింత విచారణ చేసి నిర్ణయించేదే నూరుపైసల అద్వైతసిద్ధి. దీనినే మహాద్వైతమని అనవచ్చును. ఇక యే నిర్ణయము చేయుటకు వీలు కానంత వరకు విచారణ చేసినచో అంతర్బహిశ్చసర్వత్ర అచలోయం సనాతనః అన్న సిద్ధాంతము వరకు వస్తే, అదియే పరిపూర్ణమనబడును. ఇది సర్వకాలాలలో సర్వ దేశాలలో స్వతస్సిద్ధమై ములుగ్రుచ్చ సందు లేక అచలమై యున్నది. దీని నెఱిగే మనస్సు మరియు అహంకారము లేనివై నప్పుడే శేషించి యుండును. ఇక పరిపూర్ణము నెఱిగే దెట్లు? ఇచ్చోటనే అచల సిద్ధాంతమునకు అంకురార్పణ జరిగినది. దీనికి ఆధారము వేదాంతము నిర్ణయించిన రహస్యత్రయ మంత్రములు మరియు అనంతోపనిషత్, సర్వసారోపనిషత్తులే ప్రమాణము. అందువలన అచల సిద్ధాంతమనిన, మహాద్వైతమే గాని మరొకటికాదు.

అయితే అద్వైత మతస్థులు అచల సిద్ధాంతమును పరిశీలించకనే నిషేధించు చున్నారు. ఇక అచల పద్ధతిననుసరించేవారు, వారిదేదో క్రొత్త సిద్ధాంతమని మురియుచు మత పద్ధతిని పరుష పదజాలముతో నిరసించు చున్నారు.

అసలు బ్రహ్మమునే యెఱుగనివారు బ్రహ్మము నెట్లు నిరసింతురు? మనస్సునే దాటనివారు అహంకార చైతన్యము నెట్లు నిరసింతురు? అజ్ఞానము వీడకనే జ్ఞానమును నిరసించ గలమా? అవిద్య వీడకనే, మాయను దాటగలరా? శుద్ధ సత్వమాయతో గూడిన బ్రహ్మము నెఱుగక త్రిగుణ రహిత మెట్లగును? ఇవన్నియు నేల విడచి సాముచేయుట గాదా? ఉట్టినెక్కలేనివాడు స్వర్గము చేరగలడా?

అనేకత్వము పోయి ద్వైతము కావలెను. ద్వైతమును నిరసించి రెండవది లేని అద్వైతము సిద్ధించవలెను. అద్వైతమన్నప్పుడు అద్వైత భావముండునా? భావము అభావమగునుకదా! మరిఅభావమే అచలము కదా! నవవిధ ద్రవ్యగుణ కర్మ స్వభావముల నిర్ణయము చేయగా యేమీ మిగులవు. శేషించునది పరిపూర్ణమని నిర్ణయించదగినది. నశించే దృశ్యజాలము లేనిదన్నప్పుడు కేవల దృక్స్థితి మిగిలి, అతడు నిశ్చేష్టితుడగును. అదే పరిపూర్ణము కదా!

అయినను మతస్థుల దోషమేమిలేదు. సాధన సౌలభ్యము కొఱకు పై భోధను రహస్యముగా నుంచుచు, శిష్యుని నడిపించుట గురుమర్మము. అంతేగాని ఒకటి తక్కువ, మరొకటి యెక్కువకాదు.

అద్వైతసిద్ధి జరుగకనే అచలము చెప్పిన నాస్తికత్వమునకు దారి తీయును. అందువలన అచలమును రహస్యముగా నుంచిరి.

ఈవిధముగా సమన్వయ పఱచినటుల ఈ "చలాచలబోధ" యను గ్రంథమందు లోతైన విచారణముగా నెంచుకొనిన అంశములు ఈ క్రింది విధముగా నున్నవి.

1. శుద్ధ నిర్గుణ బ్రహ్మమును పరిపూర్ణముగా విమర్శించుట.

2. మాయ యొక్క మూలమును నిర్ణయించి మాయమర్మ మెఱుగుట.

3. కేవల జ్ఞానమునకు పరిపూర్ణత్వము సిద్ధింపజేయుట

4. అచల సిద్ధాంతమునకు త్రోవజేసి, అద్వైతమును సమన్వయ పఱచుట.

5. ఈ విధముగా పరిపూర్ణ ముక్తిని పరమపదముగా నిర్ణయించుట

ఇదంతయు అద్వైత నిర్ణయమును మరింత స్పష్టము చేయుటయే గాని క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదించుటగాదు. కాని అదియే చివరకు అచల సిద్ధాంతమని ప్రాచుర్యమైనది. ఇట్టి ముగింపును ఈకాలపు మేధావులకు దీనిని ముందే వివరించినప్పటికిని వారు అవగాహన చేసికొనగలరు. అందువల్లనే రహస్యమును బట్టబయలు చేయుటకు సాహసించడమైనది.

అద్వైత మతపద్ధతిని చలన మనియు, చలన శీలమనియు, మరియు అచలమును, సిద్ధాంతమనియు భావించి, యీ నిజ ప్రబోధకు "చలాచలబోధ" యని నామ మొసంగ బడినది.

శ్రీవారు అంతరంగిక గురువులు. బ్రహ్మశ్రీ ముమ్మలనేని సుబ్బారావుగారు సాంప్రదాయ గురువర్యులు. వారి బోధను, అనుభవమును అందిపుచ్చుకున్నట్టి గ్రంథకర్తను పూర్ణము జేసి, అధికారిగా నిర్ణయించిరి. ఆంతరిక గురువుల స్ఫూర్తిగా చలాచలబోధను అద్వైత గ్రంథముల

ననుసరించి విమర్శించడమైనది. అచల సిద్ధాంతమును నిష్పక్షపాతముగా చదివి, అద్వైతముతో సమన్వయపఱచడమైనది.

హిమాలయ ఋషి పుంగవులు సంత్ శ్రీ విశ్వాత్మగారితనిని సాంప్రదాయ గురుని యొద్దకు జేర్చి అధికారిని గావింపజేసిరి. ముందుగానే, ఇతని యింటివద్ద నిత్యము జరుగు సత్యంగమునకు "చలాచలబోధ" యని నామ మొసంగిరి. ఆశ్చర్యముగా ఈ రోజున "చలాచలబోధ" యను గ్రంథము ఇతని ద్వారా వెలువరించుట అనూహ్యము.

గ్రంథమందలి వివరములు పెద్దలకు అభ్యంతరము గాని విధముగా తీర్చిదిద్ది పరిష్కరించిన శ్రీ ప్రాతూరి విద్యాసాగరు గారి కృషి అత్యంత శ్లాఘనీయము మరియు వారి అనుభవము శిష్యులకు ఎంతో శ్రేయస్సు నందించుచున్నది.

ముముక్షువులు, జిజ్ఞాసువులు, ఈ చలాచలబోధను చదివి ఆనందింతురుగాక! పెద్దల విధానమునకు సరిపోక పోయిన యెడల ఇతనిని మన్నించి, సారాంశమును మాత్రము స్వీకరింతురని ప్రార్థన. పూజ్యులైన పెద్దల ఆశీర్వాదమును వేడుచున్నాను.

**విజ్ఞాన స్వరూప్**



# చలాచలబోధ

1. గురుబ్రహ్మ గురుర్విష్ణు: గురుదేవో మహేశ్వర:।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమ:॥

2. బ్రహ్మానందం। పరమసుఖదం। కేవలం జ్ఞానమూర్తిం।
ద్వంద్వాతీతం। గగనసదృశం। తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకం। నిత్యం। విమలమచలం। సర్వ ధీసాక్షిభూతం।
భావాతీతం। త్రిగుణరహితం। సద్గురుం తం నమామి॥

3. ఓం నమోబ్రహ్మాదిభ్యో। బ్రహ్మ విద్యా సాంప్రదాయ కర్తృభ్యో।
వంశఋషిభ్యో। మహాద్భ్యో। నమోగురుభ్య:।
సర్వోపప్లవరహిత ప్రజ్ఞానఘనప్రత్యగర్థో।
బ్రహ్మైవా2హమస్మి। అహం పదార్థరహిత:॥

4. అస్మద్గురు సమారంభాం। కృష్ణ సాందీప మధ్యమాం।
ఓంకారపీఠపర్యంతాం। వందేగురు పరంపరాం॥

5. ఓం పూర్ణమద:। పూర్ణమిదం।
పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ। పూర్ణమేవావశిష్యతే॥
ఓం తత్సత్। ఓం శాంతి: శాంతి: శాంతి:॥

6. సహనావవతు। సహనౌభునక్తు।
సహవీర్యం కరవావహై।
తేజస్వినావధీతమస్తు।
మావిద్విషావహై॥
ఓం శాంతి: శాంతి: శాంతి:॥

# చలాచలబోధ  వివరణము

చలము అంటె కదిలేది. అచలము అంటె కదలనిది. చలించాలన్నా చలింపజేయాలన్నా ఎఱుక, చైతన్యము మరియు త్రిగుణాలు అవసరమవుతాయి. కనుక అచలము అంటే చలించనిది, ఎఱుక రహితము, ఆవరణ రహితము, చైతన్య రహితము, త్రిగుణ రహితము. ఇంకను అచలమంటే చలనాలకు కారణముగానిది మరియు చలనశీలత లేనిది. చలించుటకు త్రిపుటి, ద్విపుటి యుండవలెను. అచలమంటె త్రిపుటి ద్విపుటులు కాదు.

జగతి అంటే పుట్టి, గతించేదని అర్థము. ఇది అచలముకాదు. సృష్టి స్థితిలయములు గానిది అచలము. జగత్కారణముగానిది అచలము.

ఈశ్వరుడు అంటే సమిష్టి మనస్సు, సమిష్టి ఇంద్రియములు, సమిష్టి రూపములు. ఈశ్వరునికి జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలున్నవి. విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులుగా వ్యవహరించును. వీటియందు పరిణామమున్నది మరియు చలనములున్నవి. కనుక అచలమంటే ఈశ్వరుడుకాదు.

జీవులు వాసనా పూరితముగా, అవిద్యాప్రేరితముగా చలించుచున్నారు. కర్మచే ప్రేరేపింపబడుచున్నారు. స్వతంత్రత లేక కీలుబొమ్మల వలె తిరుగుచున్నారు. కనుక జీవుడు అచలముగాదు.

ఈ విధముగా జీవేశ్వర జగత్తులు అచలముగాదు. జగత్తుకు సుఖదు:ఖమయ చలనములు లేవు. ఈశ్వరుడు మాయకు వశుడు కాదు. నిరుపాధికుడైనందున సుఖదు:ఖములు లేవు. ఇక జీవుడు మాత్రము అజ్ఞానము చేత తానే కర్త, తానే భోక్తయని యనుకొనుచు, బద్ధు

డగుచున్నాడు. అందువలన జీవునికి ముక్తి యవసరమైయున్నది. జీవుడు అజ్ఞానము విడచిన ముక్తియందురు. లీలా విలాసుడైన ఈశ్వర ప్రేరితుడు గనుక జీవుడు ఈశ్వరానుభవము నుండి కూడ విముక్తుడగుట యవసరము. అనగా ఎట్టి చలనములున్నను, అది జనన మరణ రహితముగాదు. కనుక అచలమే పరమపదము. పరమపద మార్గమందు, ముందుగా అజ్ఞానం నుండి విడుదల, తరువాత జ్ఞానం నుండి కూడా విడుదల కావలసియున్నది. మత పద్ధతి అద్వైతమును నిర్ణయించగా, అజ్ఞానము నుండి విడుదలయే ముక్తియని నిశ్చయించును. ఇది వేదాంతసారము. జ్ఞానశక్తి యందలి చలనశీలత నుండి వేరగుటయే భ్రాంతి వీడుటయని వేదాంతాతీత సిద్ధాంతము.

వేదం అనగా వ+ఇదం అనగా "ఉన్నది ఇది" యని అర్థం. విద్ అనగా తెలివి, జ్ఞానము యని అర్థమున్నది. ధర్మ, కర్మ సూత్రాలను తెలిపే జ్ఞానమేగాక, బ్రహ్మను నిర్ణయించే జ్ఞానము వేదాంతము. వీటి యందు తత్త్వములు, త్రిపుటులు, ద్విపుటులు, చలనములు, ఎఱుకనెడి జ్ఞానమున్నవి. కనుక అచలమంటె యెఱుకకు మూలం లేనిది మరియు యెఱుక గానిది.

ఎఱుకన్నా మాయ యన్నా త్రిగుణములే. త్రిగుణములు ప్రేరణగా నున్న, యది పరమాత్మ. త్రిగుణములు వ్యవహారముగా నున్నచో నది జీవాత్మ. త్రిగుణములణగి, అవ్యక్తముగా నున్నచో నది పరబ్రహ్మ తత్త్వము. బీజవత్‌గా నున్న త్రిగుణములు తిరిగి విజృంభించితే అది యెఱుకకు మూలము. ఈ విధముగా పరబ్రహ్మ తత్త్వము స్వరూప జ్ఞానమైనను, పరమాత్మగా పరిణమించు చుండును. పరమాత్మ యందు సంకల్పము గలిగి జీవేశ్వర జగత్తులుత్పన్నమగు చుండును. దీనికి అంతము లేదు. బ్రహ్మమందు జ్ఞానముడిగి పోనంత వరకు సంకల్పములు వచ్చుచునే యుండును. అజ్ఞానముతో బాటు జ్ఞానమును కూడ వదలి, మీరినప్పుడే చలనములుడిగిపోవును. త్రిగుణములంకురించక

పోవుటయే త్రిగుణ రహితము. త్రిగుణ రహిత బ్రహ్మము మాత్రమే, త్రిగుణాత్మక మాయకు అసంగము, విలక్షణము.

అసంగుడైన బ్రహ్మమందనాది మాయలేనిదై।
ముసుంగు గప్పినట్లు నిండి। మూలకారణాంశమై।
పొసంగి విశ్వమందు జేరి। భూతభౌతికాదులై।
మసంగి జచ్చిబుట్టుచుండు। మారు లేక నంతటన్॥

పరబ్రహ్మ అసంగుడు. అట్టి బ్రహ్మమందు లేని మాయ ఆ బ్రహ్మమునకెట్టి సంబంధము లేకనే ముసుగు కప్పినట్లు భ్రాంతి గల్గించుచు నిండి యుండి, అనాదిగా నున్నది. భ్రాంతియే మూలకారణమై, దాని నుండి లేకనే తోచిన దేశ కాల వస్తుజాలము నంతటిలో అంశీభూతమై, విశ్వ రూపమైనది. పిమ్మట విశ్వమంతయు అనేక బ్రహ్మాండ పిండాండములైనది. వీటిలో ఉత్పత్తి, స్థితి, నాశనములును, చావుపుట్టుకలును కల్పించబడి జీవేశ్వర జగత్తులు మిథ్యగా నేర్పడినవి. వీటియందంతటను అంశీభూతమైనది మాయ యనెడి యెఱుక. అయినను అసంగుడైన బ్రహ్మము అచలము.

బ్రహ్మమసంగమైనందున, సకలము మాయ కారణాంశమే. బ్రహ్మమచలమైనందున త్రిగుణ రహితము. ఈశ్వరాధిష్ఠానముగా, మాయయే చలన కారణమై మరియు చలన వ్యవహారము జరుపుచున్నది. ఇట్టి సగుణ బ్రహ్మమైన ఈశ్వరుడు పరమపదముగాదు. అయినను, సగుణోపాసకులు ఈశ్వరు నీవిధముగా స్తుతించెదరు.

ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై।
ఎవ్వనియందుండిందు పరమేశ్వరుడెవ్వడు। అనాది మధ్యలయుండెవ్వడు।

**సర్వము తానుయైన వాడెవ్వడు। వానినాత్మ భవు నీశ్వరు నే శరణంబు వేడెదన్॥** **- పోతన**

ఈ స్తుతి యందు బ్రహ్మము పాత్ర యేమియులేదు. మాయ సంబంధమైనవే యున్నవి. పూర్ణ జ్ఞానముచే నసంగుడైన బ్రహ్మమును అచలముగా నిర్ణయించి, మాయను భ్రాంతిగా నెంచి చూడవలెను. అచల బ్రహ్మము మాయకు అధిష్ఠానము కాదు, నిరపేక్షము. మత పద్ధతి యందు అధిష్ఠాన బ్రహ్మమనగా నెఱుక బ్రహ్మమే గాని, అచల బ్రహ్మముగాదు.

అయినను, సాధకుల సౌకర్యము కొఱకు, వారు చిత్తశుద్ధిని సాధించుట కొఱకు నవవిధభక్తి మార్గమేర్పడెను. దీని కొఱకే ఈశ్వరుడను సగుణ బ్రహ్మమును పెద్దలు కల్పించిరి. జ్ఞాన సముపార్జనకు సగుణ నిర్గుణ భేదమెఱిగి బ్రహ్మ నిర్ణయము గావించవలెను. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులకు యే నిర్ణయమో, తెలిసికొనవలెను. అనగా యెఱుకతోనే ముక్తియా లేక యెఱుక వీడితేనే ముక్తియా యని వేదాంతాతీతముగా నిర్ణయించవలెను.

శ్రు॥ **అణోరణీయాన్ మహతోమహీయాన్** గానున్న దానిని మాయ యనెడి యెఱుకగా నిర్ణయించినచో, సర్వ భూతాంతరాత్మ కూడా భ్రాంతియే. లక్ష్యార్థమైన యెఱుక బ్రహ్మము 'త్వం' యైనచో, సృష్టికి పూర్వము త్రిగుణ బీజమైన బ్రహ్మము 'తత్' యైనచో, 'తత్' 'త్వం' లు రెండును యెఱుకే. ఆవిధముగా తత్ త్వం అసి యనెడి మహా వాక్యము సార్థకము. చేతన బ్రహ్మమును 'తత్' గాను, చైతన్య బ్రహ్మమును 'త్వం' గాను గుర్తించగా తత్త్వమసి మహా వాక్యము ఎఱుక పద్ధతిలో సార్థకము. అచల పద్ధతిలో తత్ రహితము. ఈవిధముగా అవ్యక్తములో చేతన గాను, వ్యక్తమైనది కామాలేదు. చైతన్యముగాను యెఱుక పరిపోషింపబడుచున్నది. కనుక యెఱుక లేకుంటేనే జననమరణ రహితము.

మాయతో గూడిన బ్రహ్మము యెఱుక బ్రహ్మము. అందువలన యీ బ్రహ్మము భ్రాంతి. కనుక సత్‌చిత్ అనందము కూడా భ్రాంతియే. చిత్ యనగా చైతన్యము లేక యెఱుక. అందువలన యెఱుక బ్రహ్మమే, సత్ కాకపోయినను, సత్ శబ్దముగా పిలువబడుచున్నది. ఈ బ్రహ్మమే అవిద్యా శబలిత బ్రహ్మము. సత్ శబ్ద వాచ్యమైన అవిద్యా శబలిత బ్రహ్మము నుండే అఖిల జగత్ ఏర్పడింది.

"సచ్ఛబ్దవాచ్యం - అవిద్యాశబలం బ్రహ్మణో అవ్యక్తం, అవ్యక్తోమహతు, మహతో మహదహంకార: అహంకారో పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యో పంచభూతాని, పంచభూతేభ్యో అఖిలం జగత్" అని వివరించితే యెఱుక బ్రహ్మము చలమనియు, కదలని బ్రహ్మము అచలమనియు నిర్ణయము. మాయ లేక మూలావిద్య చలనములకు కారణము గనుక,అసంగుడైన బ్రహ్మము అచలము. అచల బ్రహ్మ నిర్ణయమే పరమపదమార్గము.

కం॥ కదలనిది కదలదెన్నడు। కదలికగలదనిన దానికగుపడదు మొదల్।
కదలికలేనిదది గావున ఇది పరమరహస్యం। బెవ్వ రెఱుగరు దీనిన్॥

కదలనిది అచలం. ఎప్పటికీ అది గుణ రహితము. కదిలేది చైతన్యవంతము. కాని కదిలే దానికి మూలం లేదు. ఎఱుకలేనిది యచలము గనుక, దీని నెవ్వరెఱుగరు. ఇది పరమ రహస్యము. గురు కృపచే కైంకర్య పద్ధతిగా దెలియబడును.

కం॥ కదలనిది కదిలెనన్నను। ముదమున వినదగదు వారి ముచ్చట లెప్పుడున్।
కదలిన, కదలనిదెట్లగును అది। గావున, కదలదనుచు నమ్మదగు జూమీ॥

కదలనిది కదిలింది అనినా, కదలుచున్నది కదలనిదగుచున్నదనినా నమ్మరాదు. కదిలేది వేరు, కదలనిది వేరు. ఈ రెండింటిలో కదలనిది యచలము. కదిలేది భ్రాంతి. శుద్ధ నిర్గుణ బ్రహ్మమును అచలముగా

నిర్ణయించినప్పుడు, చలించేదంతా త్రిగుణాత్మక మాయ యని నిర్ణయించబడాలి. కనుక శుద్ధ నిర్గుణ బ్రహ్మమును, మాయ మర్మమును విమర్శించి జూడవలెను. ఇందులో భాగంగా కేవలజ్ఞాన మంటేను, పరమపద మంటేను పున: నిర్వచించవలసియున్నది. ఈ విమర్శతో తేలిన సిద్ధాంతము ననుసరించి నిజ ప్రబోధ నేర్పరచబడెను. గురువు సహాయము లేనిదే కడదేరుట కష్టము గనుక, అచల పద్ధతిలో సచ్ఛిష్యుని అర్హతలు, అచల గురుని యావశ్యకతను వివరించవలసియున్నది. చలాచల బోధ ద్వారా సాధారణ మత పద్ధతిని కొంత వరకు అంగీకరించుచునే, ఆపై బోధగా మాత్రమే అచల పద్ధతిగా నిజ ప్రబోధ వివరించబడినది. ఈ రెండును వైరుధ్యముగాదనియు, ఒక దాని కొకటి యవసరమై, చివరకు పరమపదము నిర్ణయించబడుననియు తెలిపెడిదే చలాచలబోధ.



# శుద్ధ నిర్గుణ బ్రహ్మము

సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కటిగా నున్నది. బ్రహ్మము నిర్గుణము, నిరాకారము. సాకార సృష్టి కల్పించబడి త్రిగుణములుగా వ్యవహరించుచు, తనకు తాను తోచెను. బ్రహ్మము పరిణమించలేదు. బ్రహ్మము సృష్టి యున్నను, లేకున్నను, ఎప్పటికిని నిర్వికారము మరియు నిర్గుణము. రెండవది అనేది లేనట్టి ఒక్కటిగా నున్నది. **ఏకమేవా2ద్వితీయం** బ్రహ్మ. సృష్టికి ఆధారము, అధిష్ఠానము అని చెప్పడం వలన బ్రహ్మము సగుణమైనట్లు తోస్తున్నది. మాయ మాత్రమే త్రిగుణాత్మకము. నిర్గుణబ్రహ్మ మాయకు అసంగము. మాయ అనగా యేది లేదో దానినున్నట్లు తోచునట్లు జేయును. కనుక బ్రహ్మమును ఆధారమని జెప్పరాదు. బ్రహ్మమును సత్‌చిత్ ఆనంద రూపమని జెప్పుట వలన, చిత్ ప్రకాశము కల్పిత సృష్టి యందు అణోరణీయాన్, మహతో మహీయాన్‌గా వ్యాపించి, సర్వవ్యాపకమనియు, అంతర్యామి యనియు, జెప్పబడుచున్నది. భ్రాంతిగా తోచుట యందు సత్‌చిత్‌ఆనందరూప బ్రహ్మ కారణ మగుచున్నాడు. అందువలన బ్రహ్మము సగుణమని జెప్పవలసివచ్చును.

బ్రహ్మము సగుణమైనందు వలననే **ఏకో2హం బహూస్యాం** అని సంకల్పించుట జరిగినది. తన సంకల్పము నెఱవేరాలంటే, బహువిధ సృష్టి, స్థితులు తోచుట కవసరమైన జ్ఞానము ఆ బ్రహ్మ యందుండవలెను. అనగా బ్రహ్మము వేరు, జ్ఞానము వేరుగాదు. జ్ఞానస్వరూపమే బ్రహ్మము. బ్రహ్మము నుండి సత్‌చిత్ ఆనంద లక్షణమును వేరుచేయ వీలుకాదు.

అట్టి సంకల్పము కలగాలంటే బ్రహ్మము సగుణమై తీరాలి. ఆ సంకల్పము వలన ఏకం **సత్** అనెడి బ్రహ్మము తన జ్ఞానశక్తి వలన అనేకమైనట్టి యనుభవము పొందడం జరిగింది. ఏకంసత్ అను జ్ఞానము

మరచిపోవాలి. ఈ మరుపు తమోగుణ సంబంధమైన అవరణ శక్తి వలన కలిగింది. అలాగే తాను వేరు, యితరము వేరుయను భావము కలగాలి. ఇట్టి కల్పితమైన అనేకత్వ భావన రజోగుణ సంబంధించిన విక్షేప శక్తి వలన కలిగింది. కనుక యీ రెండు గుణముల సంబంధించిన అవరణ విక్షేపములను అవిద్య లేక అజ్ఞానమని జెప్పబడును. అనగా జ్ఞాన రూపమైన బ్రహ్మము తనపై తానే అవిద్యను విధించుకొనెనని చెప్పవచ్చును. ఈ విధముగా చిత్ గాను, జడముగాను మరియు చిత్ జడముల మిశ్రమమైన సకల జీవోపాధులును తానే యయ్యెను. కనుక అజ్ఞానము విడచినంత మాత్రమున యేమిప్రయోజనము. జ్ఞానము తన యిచ్ఛా సంకల్ప మాత్రమున తిరిగి అజ్ఞానులగు చున్నది గదా!

సగుణము గనుకనే, యిట్లు జరుగుచున్నది. నిర్గుణమని చెప్పబడు స్వరూపము నిజమునకు అవిద్యాశబలమై సగుణమగుచున్నది. కనుక శుద్ధ నిర్గుణ బ్రహ్మము, అవిద్య వలన శబలముగాని బ్రహ్మమును సరియైన రీతిలో నిర్ణయించవలసియున్నది. స్వరూప లక్షణ బ్రహ్మము సత్యం జ్ఞానం అనంతం. ఇది సగుణమగుటకు త్రిగుణ బీజము కలిగియున్నది. సగుణ బ్రహ్మ లక్షణము సత్‌చిత్ ఆనందము. ఇది త్రిగుణాత్మకమైన జగత్ జీవయీశ్వరులుగా నగుచున్నది. కనుక త్రిగుణ రహితమైన బ్రహ్మము అచలము. చేతన, లేక చైతన్య బ్రహ్మము చలనశీలము లేక చంచలము. బ్రహ్మమనగా అచలమే సత్యము. కాని చైతన్య బ్రహ్మము, దాని కారణముతో సహా అసత్యము. సత్యము కారణముగా నసత్యమేర్పడజాలదు. సత్యము సర్వకాలాలలో, సర్వ దేశాలలో ములుగ్రుచ్చ సందులేక అచలమై యుండును. అసత్యము తనకు తానే భ్రాంతి రూపముగా తోచును. కనుక కారణ బ్రహ్మము మరియు కార్యరూపజగత్ జీవేశ్వరులు, యీ రెండును భ్రాంతియే. **అవిద్యాతత్కార్య**

రహిత: శుద్ధ:. ఇక శుద్ధ నిర్గుణ బ్రహ్మమును వేదాంత వాక్యములలోనే నిరూపించవీలగును. దీనిని అవగాహన జేసికొనుట ద్వారా అచల పరిపూర్ణ పరబ్రహ్మ నిర్ణయమగును.

శ్లో॥ **పూర్ణమేవా నిరాలంబం। అగ్నేయంచ నిర్గుణం తథా।**
**దక్షిణే నిత్య శుద్ధంచైవ। నైఋత్యే నిరుపద్రవం।**
**పశ్చిమే నిష్కళంచైవ। వాయువ్యేచ నిరంజనం।**
**ఉత్తరేచ నిరాకాశో। ఈశాన్యే నిర్మలోభవేత్।**
**ఊర్ధ్వశ్చ నిరాకారత:। అథశ్చ నిర్వికారత:।**
**అంతర్బహిశ్చ సర్వత్ర। అచలోయం సనాతన:॥**

వ్యాఖ్యానము:

నిరాలంబమనగా దేనికిని ఆధారముగానిది మరియు దీనికి మరియొక అధారము లేదు. నిర్గుణం తథా యనగా యేకాల మందైనా గుణ రహితమే, బీజముగానైనా గుణములు లేనిది. అవ్యక్తము సగుణమునకాధారము గనుక, యిది సగుణ నిర్గుణ బ్రహ్మలకతీతమై, స్వతస్సిద్ధమైనది. బీజవృక్షన్యాయముగా గుణములతో గూడిన బ్రహ్మము భ్రాంతి. కనుక తథా నిర్గుణమైన బ్రహ్మము అచలము.

నిత్య శుద్ధమనగా మరొక కాలమందైనను త్రిగుణ మాలిన్యమంటనిది. నిరుపద్రవ మనగా దశ విధ ప్రళయాలు, తాపత్రయములనెడి ఉపద్రవాలు లేనిది. నిష్కళమనగా వృద్ధి క్షీణములు, పరిణామములు, వ్యక్తావ్యక్తములు లేనిది. చలనశీలత గుణముల కారణము గావున, నిర్గుణమే నిష్కళం. చలనశీలత లేనిది యచలము.

నిరంజనమనగా పై పూతలు, లేపనములు లేనిది. రెండవదైన

మాయయంటనిది. మాయ యనగా లేనిది గనుక, రెండవదే లేదు. అనగా భ్రాంతికి యాధారము గానిది శుద్ధ నిర్గుణ బ్రహ్మము. నిరాకాశమనగా, తనయందు మరొకటి యుండుటకవకాశ మీయనిది. తానే నిండి నిబిడీకృతమై, ములుగ్రుచ్చ సందులేక యున్నది.

అచల పరిపూర్ణమైయుండి మరొకటి దాని యందు చేరుటకవకాశ మీయనిది గావున, నది నిర్మల బ్రహ్మము. నిరాకారత: యనగా ఆకారము లేనిది మరియు ఆకారముల కవ్యక్త రూపము గూడా కానిది, తన్మాత్ర రహితము. నిర్వికారత: యనగా పై విధములన్నియు సరిపోయినను, యేకాలమందైనను, వికారము చెందినచో నది శుద్ధ నిర్గుణ బ్రహ్మము కానేరదు. కనుక యది నిర్వికారము.

అంతర్బహిశ్చ సర్వత్ర యనగా లోపల వెలుపల యనే భేదము లేక యంతటా నిండి నిబిడీకృతమై, ఒక్క తీరుగా నున్నది. అచలోయమనగా చట్టు వలె కదలక యున్నది. సనాతన: యనగా ఆద్యంతములు లేనిది.

వేదాంతమందు యిట్టి శుద్ధ నిర్గుణ బ్రహ్మ నిర్ణయము జేయుట వలన అచల పరిపూర్ణ పరబ్రహ్మ లక్ష్యము వేదాంతాతీతముగా స్వీకరించుటను సమర్థించడమైనది. అందువలన అద్వైత మత పద్ధతికి నతీతముగా అచల సిద్ధాంతమును ప్రతిపాదించడమైనది. నిజమునకు నీ సిద్ధాంతము క్రొత్తది కాదు. అనంతోపనిషత్ సర్వసార పూర్ణోపనిషత్ లిప్పటికే నిట్టి అచల పరిపూర్ణ పరబ్రహ్మను వివరించి యున్నది.

శ్రుతులు, భగవద్గీత మొదలగునవి యచల బ్రహ్మము నీవిధముగా నిర్ణయించుట జరిగినది.

శ్లో॥ సర్వ శూన్యం మాయా రూపం। జన్మ శూన్యం స్వభావతా:॥

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా। దేహోనాస్తి కదాచన॥

శ్లో॥ నిత్య శుద్ధం నిరాభాసం। నిరాకారం నిరంజనం॥

శ్లో॥ ఆనంద రహితోస్మి। నిత్యమచలం।
నిర్ఘాత నిర్ఘోత। నిరింద్రియత్వం।
నిర్మోహ నిర్ద్వంద్వ। నిరూప సత్యం।
పరాత్పరం। నిత్యమహం నమామి॥

శ్లో॥ అవాచ్యం హ్యాఖండం। హ్యా లక్ష్యం। హ్యా బాధ్యం
హ్యా సంగం హ్యా వేద్యం। హ్యా చింత్యం। హ్యా రూపం।
హ్యా సాధ్యం హ్యా నాద్యం। హ్యా తీతం హ్యా నంతం।
హ్యా శుద్ధం హ్యా బద్ధం। హ్యా నామం నమామి॥

శ్లో॥ నైనం ఛింధంతి శస్త్రాణి। నైనం దహతి పావకః।
నచైనం క్లేదయంత్యాపో। న శోషయతి మారుతః॥

శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో। నిర్వికల్పో నిరంజనః।
నిర్వికారో నిరాకారో। నిత్యముక్తోస్మి నిర్మలః॥

శ్లో॥ క్షరాక్షరాభ్యా విలక్షణః॥

వీటి యొక్క పదవిభజన గావించి విమర్శించినచో, నచల పరిపూర్ణ పరబ్రహ్మమే సిద్ధాంతీకరించబడును. కావున మత పద్ధతిగా నిర్ణయించబడిన భగవంతుడు షడ్గుణైశ్వరుడు గనుక నిర్గుణుడుగాదు. భగవంతుడనగా (1) ఐశ్వర్యము (2) ధైర్యము (3) కీర్తి (4) తేజస్సు (5) జ్ఞానము (6) వైరాగ్యము. వీటి పర్యవసానము నిర్గుణ మగును. కాని భగవంతునిలో గల ఈశత్వము లేక మహత్తు వలనను మరియు జ్ఞానశక్తి వలనను సర్వము తోచును. అనగా నిర్గుణము చెదిరి సగుణ సర్వమగును. అందువలన నది శుద్ధ నిర్గుణ బ్రహ్మము గాదు.

ఈ విధముగా భగవంతుడు భ్రాంతి యనుట దోషముగా

గనువడును. వేద ప్రమాణముగా భగవంతుడు నత్యమే. వేదాంతాతీతముగా విమర్శించి జూడగా నచల పరిపూర్ణ పరబ్రహ్మమే శాశ్వతము.

జనుల తెలివిని బట్టియు, వారివారి జన్మ సంస్కారమును బట్టియు మతములు బుట్టినవి. అవి కొంతవరకే బయల్పఱచి, కొంత రహస్యమును కొనసాగించినవి.

శ్లో॥ **శిష్యాణాం బోధసిద్ధ్యర్థం। తత్త్వజ్ఞై కల్పితం క్రమాత్॥**

శిష్యులకు బోధించుటకు కొంత రహస్యమును గాపాడుచునే, అర్ధ నత్యములను కల్పించిరి. ఇది శిష్యుల మేలు కొఱకే. తగిన సమయములో, శిష్యుని జ్ఞానానుసారము రహస్యమును విప్పి జెప్పెదరు. వేదాంత పద్ధతిగా నక్కడికదే ప్రమాణము. ఒకానొక అనుభూతి జెందిన పిదవ రహన్య మంత్రములనువదేశించి, మంత్రార్ధ, మంత్ర రహన్యములను ప్రబోధించెదరు. అంతకు ముందటి బోధను నిరసించెదరు. ఇందేదోషమును లేదు.

శ్రు॥ **ఉత్తర్ణేతుపారే నౌకాయాం కిం ప్రయోజనమ్॥**

ఏరుదాటుటకుపయోగపడిన నౌకను, యేరు దాటిన పిదవ వదలివేసి, మరియొక ప్రయాణ సాధనమునుపయోగించెదరు. నౌకయెంత గొప్పదైనను, తర్వాతి ప్రయాణమునకవరోధమేగదా! అట్లే అజ్ఞానము వీడునంత వరకు పరబ్రహ్మ పరమాత్మలను మత పద్ధతిగానే నిర్ణయించవలెను. జ్ఞాన సిద్ధి పిదప అచల పద్ధతిగా నిర్ణయించుకొని, రహస్యాత్రయ మంత్ర పద్ధతిగా నిజప్రబోధ జరుగవలెను. అంతేగాని, అజ్ఞానము తొలగకముందే జ్ఞానము వ్యర్థమని జెప్పరాదు. అప్పుడచల

సిద్ధాంతము నాస్తిక వాదమగును. కనుక నిజమైన జననమరణ రహితమునకు అద్వైత మరియు అచల పద్ధతులను సమన్వయ పఱచుకొని చలాచలబోధానుసారము పరిపూర్ణము గావలెను. సాలోక్యాది ముక్తుడైన సచ్ఛిష్యుడే అచల బోధకు లక్షణయుతమైన అధికారికాగలడు.



# మాయ మర్మము

మాయ మూల మెక్కడ? సాధకుని దృష్టిలో మాయ యొక్క అంత మెక్కడ. ఈ రెండూ తెలిస్తే మాయ మర్మము తెలియబడును. మాయ తత్కార్యముల మర్మము తెలిసినవాడే భ్రాంతి వీడును. భ్రాంతి పోవుటయే జననమరణ రహితము. మాయ మూలము మూలా విద్య. అది ఈశ్వరునికి మాయగాను, జీవునికి అవిద్యగాను భ్రమగొల్పి, ఆడించే వాడిగాను, ఆడేవాడిగాను జేసెను. మూలావిద్యకు మూలము లేదు.

శ్రు॥ **మాయాచ అవిద్యాచ స్వయం ఏవ భవతి॥**

మూలావిద్య అనాదిగా నుండి తనకు తానే 'మాయ' గాను, 'అవిద్య' గాను తోచుచున్నది. **'యామాసామాయా'** అనగా నేదిలేదో యది ఉన్నట్లును మరియు ఒకప్పుడున్నది మరొకప్పుడు లేనిదిగా గాని, లేక మరొకటిగా గాని తోచి భ్రాంతి పుట్టించుచుండును. అవిద్యా దోషమున్న జీవులనది విక్షేపమొనర్చి బంధించుచున్నది. విశేషమైన వాసనలకు భిన్న భిన్నములుగా, జీవులకు తోచుచున్నది. ఏ వాసన లేని కర్మ జీవియుండదు గాని, ఉన్నట్లైతే, యా జీవికి ప్రపంచమే లేదు. జ్ఞాని విషయంలో, జగన్మిథ్య, అనగా జగత్తున్నను లేనిదిగాను, ఉదాసీనముగాను జూచును.

మాయ దేని కారణముగా పుట్టింది?

శ్రు॥ **మాయ దెలియరాదు। మాయ మూలము లేదు॥**

మాయ సత్ గాదు, అసత్ గాదు, సదసత్ కూడా గాదు. కనుక మాయ అనిర్వచనీయము. విశ్వావిర్భావమునకు మాయ మూలకారణాంశము గనుక మాయ అనాది.

మాయ యనెడి మూడు గోడలచే బంధింపబడిన పురుషుడే మాయాశబలితుడు. మాయకున్న మూడు లక్షణములు కళ, కాలము, నియతి. కళ యనగా చలన హేతువు. కాలమనగా చలనముల గుర్తింపు. నియతి యనగా నియమానుసారమైన చలనములు. ఇవే మూడు గోడలు. దీని వలన పురుషునికి జ్ఞానమేర్పడెను. జ్ఞానము, లేక విద్యవలన సృష్టి పై రాగముగల్గెను. కనుక కళ, కాలము, నియతి, విద్య, రాగమను ఐదు పొరలనే మాయాకంచుక మందురు. అందువలన మాయ వలన నియమబద్ధమైన సృష్టి, స్థితి, లయములు, జ్ఞానాజ్ఞాన యనుభవములు, పరిణామరూప జగత్తు మరియు జన్మ కర్మ చలనములు జరుగుచున్నవి. ఇవి యన్నియు మాయా శబలిత బ్రహ్మమైన పురుషునిచే జరుగుచున్నను, యతడు అధిష్ఠాన బ్రహ్మము. అతడు కర్తగాడు, భోక్తగాడు. అయినను త్రిగుణ రహితము గాదు.

మాయను యెఱుక యనియు, చైతన్యమనియు అనవచ్చును. ఎందుకనగా, అధిష్ఠాన బ్రహ్మ మాయ వల్లనే చైతన్యవంతుడయ్యెను. కనుక మాయ మూలమనిన యెఱుక మూలమే.

కం॥ **ఎఱుకోత్పత్తినిదెలియగ।**
**సరసిజ గర్భాదులైన చాలరనెడిచో నరుడెంతటి వాడు।**
**వాడది యెఱుగుదుననిన వట్టిమాట॥**

అని పెద్దలందురు అయినను, మాయ నెఱుగుటకు సద్గురుకృప గావలెను. అట్లే మాయ నుండి విడుదలకు గూడా గురుకృప అవశ్యము.

కం॥ **ఎఱుక తనకు దా విడిపోదు।**
**ఎఱుకను విడిపించలేరెవ్వరు ధాత్రిన్।**
**గురుడొక్కడు తప్ప॥**

గురుశిష్య న్యాయముచే గాని మాయను దాట శక్యము గాదు. ఇది గురుగోప్యము.

మాయ రెండు విధములు. (1) శుద్ధ సత్వమాయ (2) మలిన సత్వమాయ

శ్రు॥ **శుద్ధ సత్వ విశుద్ధాభ్యాం మాయా విద్యేచ తేమతే।**
**మాయాబింబో వశీకృత్యతాంస్స్యాత్సర్వజ్ఞ ఈశ్వర:॥**

చిత్ ప్రకాశము శుద్ధ సత్వ మాయ యందు పడి ప్రతిఫలించగా, (1) అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశము, (2) మాయ, (3) ప్రతిబింబ ప్రకాశము, యీ మూడు గూడి ఈశ్వరుడయ్యెను.

అదేవిధముగా, చిత్ ప్రకాశము మలిన సత్వ మాయ యందు పడి ప్రతిఫలించగా (1) అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశము, (2) అవిద్యారూప మాయ, (3) అవిద్య యందు ప్రతి ఫలించిన ప్రతిబింబ ప్రకాశము, యీ మూడు గూడి జీవులయ్యెను.

ఈశ్వరుడు రజోగుణము వలన సృష్టి కర్త బ్రహ్మగా, సత్వ గుణము వలన పోషక కర్త విష్ణువుగా, తమోగుణము వలన లయ కర్త రుద్రునిగా వ్యవహరించుచున్నాడు. తన సమిష్టి యింద్రియములతో జీవుల యింద్రియములపై అధిష్ఠానత్వము వహించుచున్నాడు. ఈశ్వరునిది మాయోపాధి శుద్ధ సత్వమగుటచే మాయ పనులను జేయుచున్నను, మాయకు వశుడుగాదు. అందువలన సుఖ దు:ఖములు లేవు. ఈశ్వరునిది లీలావిలాసము.

జీవుడు తన త్రిగుణ స్వభావముచే కర్మల ననుభవించుచు, కర్మలనాచరించుచు, అవిద్య కారణముగా పునర్జన్మలనొందుచున్నాడు. మలిన సత్వమగుటచే తమో రజో గుణాలు విజృంభించగా, తాను పరమాత్మ యనెడి జ్ఞానమునుమఱచెను. దీనికి ఆవరణశక్తి కారణము.

వాసనామయ సృష్టి వాసనలున్న వానికే సత్యము. కర్మ వాసనల నుండి ముక్తుడైన వాడికి అసత్యము. అసత్యమును సత్యముగా భావించుటకు కారణము విక్షేపశక్తి. అందువలన జీవుడు బద్ధుడగుచున్నాడు. కనుక జ్ఞానము గలిగినంతనే అజ్ఞానము నుండి ముక్తుడగును.

జీవుడు యీశ్వరుడైనను, లేక పరమాత్మయైనను, తన జ్ఞానమున్నంత వరకు తనపై తానే అవిద్యను విధించుకొనుచు జీవులగు చుండును. కనుక జ్ఞానాతీతముక్తుడు గావలసి యుండును.

ఈ విధముగా శుద్ధ సత్వమందును, మలిన సత్త్వమందును త్రిగుణములున్నవి. కనుక వ్యవహారమంతము త్రిగుణాత్మకమైన మాయచేతనే జరుగుచున్నది.

శ్రు॥ **అజామేకం లోహిత శుక్ల కృష్ణా:॥**

అనగా మాయ సత్వరజస్తమోగుణముల సమిష్టి రూపము.

సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కటే యుండి, అనాది మాయ మూలావిద్య రూపముగా ఉండేది. ఈ రెండింటికి యెట్టి సంబంధములేదు. దేనికవే యున్నవి. మాయ యనగా, లేని మాయ గనుక, బ్రహ్మ మొక్కటే యన్నది సత్యము. మాయ లేనిదగుట వలన, అది రెండవది కాదు. ఈ మూలావిద్య యందు త్రిగుణములు బీజవత్‌గా నున్నవి. నిర్గుణ బ్రహ్మమని చెప్పబడే బ్రహ్మమును సగుణముగా ప్రకాశింపజేసినది మూలావిద్యయే. అందుకే యా బ్రహ్మమును అవిద్యా శబలమని కూడా యందురు. బ్రహ్మము శబలమగుటకు మూలావిద్య మూలప్రకృతి రూపమై, పురుషుని మాయా పంచకంచుకముచే బద్ధునిజేసెను. వెనువెంటనే మాయ వలన దేశ కాల పదార్థ సృష్టి క్రమ పద్ధతిగా జరుగుచు, పరిణమించుట జరిగినది. నిరావరణము యావరణముగా తోచి,

తోచినవన్నియు బ్రహ్మప్రకాశముచే వ్యాప్తమయ్యెను. ఆ సర్వవ్యాప్త ప్రకాశమే అనంత శక్తి జ్ఞానానందములుగా నుండి అంతర్యామియయ్యెను. నామ రూప జగత్తున కాప్రకాశము ఆధారము, అధిష్ఠానమయ్యెను. ఈ విధమైన విశ్వావిర్భావము మాయ వలన జరిగినది. గనుక నిజానికి యేమీ జరుగలేదు. భ్రాంతి గొల్పునవేగాని, యేమీలేదు. రెండవ దశలో మాయ శుద్ధ సత్వము, మలిన సత్వమై ఈశ్వర జీవులకు కారణమయ్యెను.

కనుక మాయను దాటవలెననిన, మొదట జీవుడు అవిద్య నుండి విముక్తి గావలెను. పిదప ఈశ్వరానుభవములో, ఆ జీవుడే మాయను దాటవలెను. తురీయమైన పరమాత్మగానున్న బ్రహ్మజ్ఞాని కళ, కాలము, నియతి (పంచీకరణము), విద్య (జ్ఞానము), రాగము (జీవేశ్వర జగత్తులపై ప్రేమ) గలిగియున్నాడు. ఈశ్వర పంచీకరణయెట్లు జరిగినదో తెలిసికొనవలెను. బ్రహ్మమైన తాను స్వరూప లక్ష్యముగా నున్న పరబ్రహ్మానుభవము పొంది, జీవన్ముక్తునిగా, తిరిగి పరమాత్మగా వ్యవహరించుచున్నాడు. ఇప్పుడు పంచీకృతము మాయ గనుక, అపంచీకృత మందు పరబ్రహ్మలేడని తెలిసి, వరుసగా కాల రహస్యము, విశ్వ రహస్యము, పరబ్రహ్మ యొుక్క యేర్పాటులో గల రహస్యము తెలిసికొనుటకు ఈ పద్ధతిని దెలుపు నిజ ప్రబోధ యేగురువు యొద్ద లభించునో యా గురువునాశ్రయించవలెను. చతుర్విధశుశ్రూషలు సలిపి కడతేరవలెను. ఇదియే జననమరణ రహిత మొనర్చుకొనుటకుపాయము.

కనుక మొదట అజ్ఞానమును, పిదప జ్ఞానమును విడువవలెను. ఇదియే అచల సిద్ధాంతము. ఈ విధముగా కడతేరిన గురువు బ్రహ్మగా కూడా లేనివాడు. అట్టి గురువు అష్టతనువులు గాదు గనుక అశరీరి. ఆ గురువెట్టి వాడో జూడుము.

**జ్ఞానియనుట గనరాదమ్మా। అజ్ఞానియనుట కదిలేదమ్మా।**
**జ్ఞానాజ్ఞానములోన నొక్కటియు తానుగాక। శూన్యానికి మీరిన**
**గురునకు మంగళ మనరమ్మా। సద్గురు మూర్తిని గనరమ్మా॥**

ఇట్టి గురువు లభించుట యెట్లనగా, లక్షణయుతమైన శిష్యుడు ఈశ్వరునికి సంబంధించిన ఘోర సంసారములో బాధపడలేక తన జ్ఞానము నుండి కూడా విడిపించుకొనుటకు తహచెందుచున్నచో, అట్టి శిష్యుని వలన మేల్కొన్న అచల గురుమూర్తి యా శిష్యునికి లభించును.

మాయకున్న పర్యాయ నామములేవనగా,

కం॥ **గురుతన, ఎఱుకన మాయె। హరిహర బ్రహ్మాదులన్న। అసురులు మాయే॥**
**గిరులన, తరులన మాయే॥ మరి బ్రహ్మాండములు మాయె।**
**మంత్రములు మాయే। వేద శాస్త్ర తంత్రములు మాయే॥**
**ధర, పంచభూతములు, వరజీవేశులు మాయే। పరిపూర్ణమందూన।**
**పరికించలేవాయే॥ మంత్రములు మాయే। వేదశాస్త్ర, తంత్రములు మాయే॥**

ప్రకృతి పురుషుల సమాగమమే సగుణ బ్రహ్మము. మొదట ప్రకృతి పురుషునితో గలియనప్పుడది మూలప్రకృతి లేక మూలావిద్య. ఆ పురుషుడే మొదట నిర్గుణుడు, పిదప సగుణుడు. మాయాకార్యాలకు నా పురుషుడు కేవలము ఆధారము, అందువలన అధిష్ఠానము. బ్రహ్మము నిజమునకు నిర్గుణుడు గాదు, సగుణుడు కాదు. అతడెప్పుడును అచలబ్రహ్మమే. మూలావిద్య కారణముగా నిర్గుణ సగుణ బ్రహ్మములు లేకనే తోచెను. నిజమునకు బ్రహ్మము అచలము, త్రిగుణ రహితము. ఆ బ్రహ్మము నుండి యేదీ సృష్టింపబడలేదు. దానిలోని కేదీ లయమవదు. బీజ వృక్ష న్యాయముగా పరిణమించేది నిర్గుణ సగుణ బ్రహ్మమేగాని, అచల బ్రహ్మముగాదు. బీజ మందు బీజ శక్తి యున్నట్లు బ్రహ్మ మందు మాయ

శక్తి త్రిగుణాత్మకముగా నున్నది. బీజశక్తి లేనిదే అంకురించుట జరుగనట్లు మాయ శక్తి లేనిదే దేశకాల పదార్థము లేర్పడవు.

శ్లో॥ **బీజ స్యాంతరివాంకురోజగదిదం ప్రాఙ్ నిర్వికల్పం పునః।**
**మాయా కల్పిత దేశ కాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం।**
**మాయావీవ విజృంభయత్యపి। మహాయోగీవ యః స్వేచ్ఛయా।**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ యిదం శ్రీ దక్షిణామూర్తయే॥**

అధిష్ఠాన పరబ్రహ్మ కూటస్థముగా యుంటూనే, మాయశక్తి కాధారముగా కూడ నున్నాడు. బీజ మందున్న బీజశక్తి వలననే అంకురముగల్గి, పిందె, కాయ, పండు వగైరాలతోకూడిన వృక్ష మేర్పడినట్లే, సర్వము మాయశక్తి వల్లనే దేశ, కాల, పదార్థములతో గూడిన బ్రహ్మాండ పిండాండము లేర్పడి చలించుచున్నవి. ఇది ఇంద్రజాలము వలె భ్రాంతిగా తోచి చిత్ర విచిత్రములగుచున్నది. మాయశక్తి కాధారముగాని బ్రహ్మమే అచల పరిపూర్ణ పరబ్రహ్మము.

కం॥ సగుణంబు మాయ గనుమిక।
సగుణంబన నదియె సర్వ సంకల్పమగున్॥
**సగుణంబు మీరినంతట అగణితంబగు స్వర్గమదియె అందగబూను।**
**ఈక్షణమందే పొందిక యూను॥**

ఈశ్వరుడు ప్రకృతిని ఈక్షించుటచేతనే సృష్టి. ఈక్షణమనగా ఈశ్వర సంకల్పము. నిర్గుణము సంకల్పించజాలదు. సగుణమే సర్వ సంకల్పములకూ ఆధారము. అందువలన సగుణమే మాయ. సగుణ బ్రహ్మమును మాయ నుండి వేరు చేయ జాలము. ఎట్లనగా బీజమును, బీజశక్తిని వేరు చేయలేము కదా! కనుక చైతన్య బ్రహ్మము సగుణము, మరియు మాయ కంటే వేరని చెప్ప జాలము. చైతన్య మనినను,

ఎఱుకనినను ఒక్కటే. కనుక యిక మీదట సగుణ బ్రహ్మమును ఎఱుక బ్రహ్మమనియు లేక ఎఱుకనియు వ్యవహరించుట జరుగును. ఈశ్వరుని అవస్థాత్రయ మందు హిరణ్యగర్భుని ఊహయే సర్వ పోషణగా, కలవలె సాగుచున్నది. త్రిగుణములు మీరితేనే సంకల్పములుడిగిపోవును. అదే నిజమైన జననమరణ రహితము. దానినే లక్షించవలెను. కనుక ఈశ్వరుడు తన సంకల్పయుతమైన ఈక్షణను నిగ్రహించి, అణచి వేయవలెను. నిజప్రభోదచే తిరిగి తలెత్త నివ్వక ఊరకుండవలెను.

ఎఱుకన్నా మాయ యన్నా, సగుణమన్నా చైతన్యమన్నా, ప్రజ్ఞానమన్నా, ప్రకాశ మన్నా ఒక్కటే. మాయను దాటవలెననిన, ఎఱుక వీడి యూరకుండవలెను. ఎఱుక వీడితే పునరావృతి లేదు. అదే పరమపదము. కనుక మాయ దాటుటయెట్లనగా,

సుసంగ హృదయమంది పొంద। సూక్ష్మ తేజ బ్రహ్మమే।
ప్రసంగ మందరానితీచ్చ। ప్రత్యగాత్మలోనిదై।
యెసంగు సూర్య చంద్ర వహ్ని। లిచ్చమీరినప్పుడా।
యసంగు నందు మాయ మాయు। నంది పొంది మించినన్॥

నిర్మలమైన హృదయములోని ప్రజ్ఞచేత తానే అచల బ్రహ్మమునని, ప్రత్యగాత్మగా మండల త్రయమైన సూర్య చంద్ర అగ్ని తత్వములనెఱిగి, అటులనే ఈశ్వరీయ సంకల్పమును విమర్శించుకొని, తదుపరి వీటినన్నిటికిని అతీతమై యుండవలెను. ఈ విధముగా తత్త్వముల నంది, పొంది, మీరి, అతీతమైనప్పుడది పరతత్వము. పరతత్త్వమందున సర్వ సంకల్పము లుడిగిపోవును. తాను లేనివాడై, ఉన్న వాటిని కలవలె జూచువాడు ఎఱుకను దాటగలడు. అప్పుడు మాయ మాయమగును.

కం॥ సంకల్పమె బంధము। నిస్సంకల్పము నొందినపుడె, సద్గతి గల్గున్॥

బ్రహ్మ సంకల్పము వలననే జగత్ జీవ ఈశ్వర భావములు గల్గి జ్ఞానాజ్ఞాన పద్ధతులలో దైవరూప మరియు జీవరూప బంధములేర్పడెను. నిస్సంకల్పము నొందినప్పు డదియే ముక్తి లేక సద్గతి.

జ్ఞాన పద్ధతిలో పరమాత్మగా యెఱిగించుచున్నాడు. అజ్ఞాన పద్ధతిలో ప్రత్యగాత్మగా విశ్వతైజస ప్రాజ్ఞులుగా నెఱుగుచున్నాడు. ఈశ్వరీయజ్ఞాన మనగా సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణలు జరుపగల సామర్థ్యము మరియు ఇచ్ఛా సంకల్పములతో వాటిని నెఱవేర్చుట. ఇది ఈశ్వరునికి బంధము. ఈశ్వరునిచే సృష్టించబడి, పోషించబడుచున్న జీవుని యొక్క పాప పుణ్య కర్మానుభవములను ఈశ్వరుని అధిష్ఠానత్వముచే ప్రేరేపింపబడుచు, తన యింద్రియముల ద్వారా భోగించుచున్నాడు. జీవునిగా ప్రత్యగాత్మయే అనుభవించుచున్నాడు.

కం॥ పరిపరి విధములు తానై। యెఱిగింపుచు, నెఱుగు గాని।
నేర్పడ, బలిగా గురుస్వామికి నర్పించెడు।
నరుడే పరిపూర్ణుడగును। నా మాట వినరా॥

పరమాత్మ, ప్రత్యగాత్మ పద్ధతులుగా, సర్వము తానేయై యెఱిగించుటయును, అనుభవించుటయును జరుపుచున్నాడు. కనుక పరమాత్మ జ్ఞానము ముక్తిగాదు. సమర్థుడైన గురుమూర్తికి, పరమాత్మగా నున్న తాను లేకుండా పోయే విధముగా, బలిగా తనను తాను అర్పించుకొన్న వాడే పరిపూర్ణుడగునని ఆర్యులు, విహిత గురువులైనవారు నుడువుచున్నారు. వారి మాట నమ్మవలెను. ఎఱిగించే పరమాత్మ యున్నంతవరకు యెఱిగే ప్రత్యగాత్మ యుంటూనే యుండును. ఎఱిగే వాడు పోయినను, యెఱిగించేవాడు మిగిలి యుండరాదు. ప్రత్యగాత్మ

పరమాత్మలిద్దరును లక్ష్యార్థములో ఒక్కటే గనుక, జీవుడుగా పోతే సరిపోదు. పరమాత్మగా కూడా లేకుండా పోవలెను. ఇదే యెఱుక మర్మము.

ఇప్పుడు ఎఱుక యొక్క హద్దు తెలిసినది. ఎఱుకగా నున్న సాధకుని యెఱుక మీరినప్పుడు మాయను దాటగలడు. ఎఱుకపోతే భ్రాంతి లేదు. భ్రాంతి పోతే యేమిలేదు. ఉన్నదేదో ఉన్నది. ఎఱుక పోయెను గనుక యెఱిగే వారుండరు. ఎఱిగే వారు లేకపోయినా పరిపూర్ణమున్నది. అది అనుభావ్యముగాదు. పరిపూర్ణమెఱుగరానిది.

ఈ విధముగా మాయను లేక యెఱుకను అన్ని దశలలోను నిర్ణయించుకొని, ఖండా ఖండములలోను నిర్ణయము జేసికొని, యూరకుండుటలోనే యెఱుక నుండి విముక్తి మరియు శేషించునది పరిపూర్ణము. భ్రాంతి నిర్ణయమైన పిదప భ్రమ వీడుటయే పరమపదము. ఎఱుకనెడి కలలో మాయ కార్యములున్నవి. భ్రాంతి నిర్ణయము వలన యెఱుకపోతే, అది కల నుండి మేల్కొలుపు. అదే పరిపూర్ణము.

**మాయ తనువై। మాయ తానై। మాయ పనులను జేయుచును మరి।**
**మాయ తన మర్మంబుగననే। మాయ మైపోవున్॥ జీవా॥ మేలు కొనవే॥**



# కేవల జ్ఞానము

శ్రు॥ **అస్తి ప్రకాశతే యితి జ్ఞాన శక్తిః॥**

ఉండుట, ప్రకాశించుటయను లక్షణములు గలదేదో అదే జ్ఞానశక్తి. అనుభవమే తానైన స్వరూపము చేతన బ్రహ్మము. ఆవరణ యందు ప్రకాశించుచు, ఉనికి తెలియజేయుచున్నది సత్ చిత్ ఆనంద బ్రహ్మము. ఈ రెండును కారణ కార్యములుగా వేరైనను లక్ష్యార్థములో నొక్కటే. అస్తి, భాతిగా నున్నది సత్‌చిదాత్మగా నున్న పరమాత్మయే చిత్‌ప్రకాశము వలన యేమి జరుగునో, అదియే జ్ఞానశక్తి. జీవేశ్వర జగత్తుల సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణలు జరుపుట యందేజ్ఞానమున్నదో అదియే జ్ఞానశక్తి. కూటస్థ బ్రహ్మమందున్న జ్ఞానశక్తియే మాయాశక్తి. సృష్టికి పూర్వము స్వరూప బ్రహ్మమందు యీ జ్ఞానశక్తి కేవల సామర్థ్యముగా నున్నది. అది సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, అకర్షణలనెడి ఈశ్వర లీలకు క్రమముగా స్తంభన, మోహన, మారణ, ఉచ్చాటన, ఆకర్షణలనెడి సామర్థ్యముగా నున్నది. సామర్థ్యమే పరబ్రహ్మతత్త్వము. సర్వ సృష్టియందు లక్ష్యార్థముగా నున్నదీ పరబ్రహ్మతత్త్వమే.

కనుక జ్ఞానశక్తిగా నున్న పరబ్రహ్మము త్రిగుణములకు బీజము వంటివాడు, అందలి బీజశక్తి లేక జ్ఞానశక్తి యా పరబ్రహ్మము నాశ్రయించి యున్నది. బీజశక్తి లేని బీజమును బీజమనరాదు. అటులనే మాయా శక్తి లేని బ్రహ్మమును బ్రహ్మమనరాదు. ఒక వేళ అనవలసివచ్చినచో అట్టి బ్రహ్మమునకును, మాయకును భేదము లేదు. ఇట్టి బ్రహ్మమును ఎఱుక బ్రహ్మమన వచ్చును లేదా చేతన బ్రహ్మమనవచ్చును. చేతన కారణముగా చైతన్యము వికసించి, ప్రకాశించెను. ఇది కార్యరూపము. కారణ మందు సత్యం జ్ఞానం అనంతం ఆనందం బ్రహ్మమేదో, కార్య మందది సత్‌చిత్

ఆనందము. కార్యరూప బ్రహ్మము నామ రూప క్రియా జగత్తు నందు లక్ష్యార్థముగా సత్‌చిత్ ఆనంద బ్రహ్మముగా నున్నది. ఈ తటస్థ లక్షణమైన సత్ చిత్ ఆనందమనునది నిష్ప్రతియోగికముగా అనృత జడ దు:ఖముల విడుదలకు లక్ష్యమై యున్నది.

సృష్టి జరుగుటకు కారణము స్తంభన సామర్థ్యము. పోషణకు కారణము మోహన సామర్థ్యము. లయ క్రియకు కారణము మారణ సామర్థ్యము. జీవుల కర్మానుసారము, లేక జ్ఞానానుసారములో కానుభవమునకు కావలసిన లోకముల విస్తీర్ణకు కారణము ఉచ్ఛాటన సామర్థ్యము. ఆయా లోకానుభవములు పొందనర్హమైన జీవుల నాలోకములలోనికి ప్రవేశ పెట్టుటకు కావలసిన ఆకర్షణ క్రియకు కారణము ఆకర్షణ సామర్థ్యము. ఈ విధముగా సృష్టికి పూర్వము సామర్థ్యము గల చేతన బ్రహ్మను అవ్యక్తమనియు స్వరూప లక్షణ బ్రహ్మమనియు యందురు. సృష్టి, స్థితి, లయములు కొనసాగుచున్నప్పుడు బ్రహ్మము వ్యక్తమై యుండి తటస్థ లక్షణ బ్రహ్మమని పిలువబడుచున్నాడు. ఈ విధముగా కారణ కార్యములన్నను, అవ్యక్త వ్యక్తములన్నను, స్వరూప తటస్థ లక్షణములన్నను, చేతన చైతన్యములన్నను ఒకే బ్రహ్మమునకు రెండు అవస్థలు. దీనిని ఎఱుక పద్ధతిగా చెప్పవలెనంటే, అవ్యక్త బ్రహ్మము ఘనరూప అఖండ యెఱుక. వ్యక్త బ్రహ్మము ద్రవరూప అఖండ యెఱుక యన వచ్చును.

సంచితములు పంచబడిన జీవులకు వారి వారి కర్మానుభవములు పొందుటకు, సమిష్టిగా ఈశ్వరుడు సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ క్రియలు జరుపుచున్నాడు. అంతటా తానేయై, యీ క్రియలు జరుగుటకాధారమగుటచేత నా ఈశ్వరుని సూత్రాత్మ యందురు. ఈ సూత్రాత్మయే వ్యవహారములో పరమాత్మయనబడును. వ్యవహారము

లేనప్పుడు సామర్థ్యము మాత్రమున్న బ్రహ్మమును సూత్రాత్మ సత్తయని యనబడును. సమిష్టి యందు పరమాత్మ రూప సూత్రాత్మ జీవుల వ్యష్టి యింద్రియములను, మనో బుద్ధులను ప్రేరేపించుచు, అధిష్ఠానత్వము వహించును. సర్వము తానెయైన సూత్రాత్మ సమిష్టి స్థూల దేహముగా విరాట్పురుషుడనియు, సమిష్టి యనుభవములకు కర్త మరియు భోక్తగానున్న సూక్ష్మ దేహమును హిరణ్యగర్భుడనియు, సమిష్టి సుషుప్తి వలన ప్రలయము సంభవించినప్పుడు అవ్యాకృతుడనియు అందురు. ఇంకను, తురీయమందు పరమాత్మ యందురు. పరమాత్మ యొక్క అవస్థాత్రయమందు, సమిష్టిగా విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులుగా పిలువబడును.

పున: సృష్టి కాలమందు సూత్రాత్మ తన సత్తను కార్యరూప మందుంచును. కర్మ శేషమున్న జీవులను, వారివారి కర్మానుభవముల ననుభవింపజేయుచునే, ముముక్షువులై ముక్తులగునంత వరకు పునర్జన్మలలో త్రిప్పుచుండును. ప్రలయకాలమందు కర్మ శేషమున్న జీవులు మైనపు ముద్దలో అద్దబడిన బంగారు రజనువలె యుండి, కాల మాసన్నమైనప్పుడు తిరిగి వచ్చెదరు.

శ్రు॥ **కారణోపాధిరీశ్వర:। కార్యోపాధిరయం జీవ:॥**

కారణమందు స్తంభన, మోహన, మారణ, ఉచ్చాటన, ఆకర్షణ క్రియా సామర్థ్యము గలిగి సూత్రాత్మ సత్తయని పిలువబడేవాడు కార్యమందు పరమాత్మగా సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ క్రియలు జరుపుచున్నాడు. ఇక జీవుల విషయంలో అవిద్యోపాధి వలన సుఖదు:ఖానుభవాలు పొందుట కార్యము. దానికి కారణమైన పరమాత్మ యొక్క సృష్టి మొదలగు క్రియలు జరుపుచున్నప్పుడు ఈశ్వరుడని

పిలువబడును. ఈశ్వరుడు తన మూడవస్థలలో, తన పంచకోశముల ద్వారా తన సప్తాంగములతో 19 ముఖములుగా జీవులను ప్రభావించుచుండును. ఈశ్వరునిది మహాకారణోపాధి లేక మాయోపాధి. ఈశ్వరుని కార్యము జ్ఞానము మరియు జీవుని కార్యము అజ్ఞానము. జీవుల కార్యములకు కారణము ఈశ్వరుడు. జ్ఞానములేనిదే అజ్ఞానముండదు. కారణము లేనిదే కార్యముండదు. కార్యము మాత్రమే దోషమన్న కుదరదు. కారణమందున్న దోషమే కార్యమందు చరించుచున్నది. అందుకే కార్యకారణ ద్వయ దోషం అన్నారు.

**శ్రు॥ కార్యకారణతాం హిత్వా। పూర్ణ బోధోవశిష్యతే॥**

అందువలన కార్య కారణాలు రెండు విడిస్తేనే పరిపూర్ణము శేషించును. కారణ తనువులు నాల్గు ఈశ్వరతనువులు. కార్యతనువులు నాల్గు జీవతనువులు. అష్టతను నిరసన జరిగితేనే పరిపూర్ణము. కారణరూప జ్ఞానము, కార్యరూపమైన అజ్ఞానము, యీ రెండు విడిస్తేనే పరిపూర్ణము. జ్ఞానశక్తి క్రియోన్ముఖము గారాదు. అనగా సూత్రాత్మ సత్త క్రియోన్ముఖము కారాదు. క్రియలో పరమాత్మ మిథ్యయని విమర్శించు కొన్నప్పుడు సత్త క్రియోన్ముఖము గాదు. పరమాత్మ యనగా సత్‌చిదాత్మ. అనగా ఉండుట ప్రకాశించుట పరమాత్మ లక్షణము. పరమాత్మ క్రియ జేయునివాడుగా మారాలంటే, అతడు ఉండుట అనే జ్ఞానమును కోల్పోవాలి. దాని వలన అతడు ప్రకాశించడు.

**శ్రు॥ నభాతి నాస్తి కూటస్థ ఇత్యాది సాదున మావృతి:॥**

ఉండనిది, ప్రకాశించనిదేదో అదే కూటస్థము. ఇది స్వరూప లక్షణమైనను, కాల ప్రభావమున పరమాత్మ తోచును. అతడు సత్ చిదాత్మ. కనుక కార్య కారణ ద్వయ దోషనివారణగా, అసలు ఉండనిది, అసలు

ప్రకాశించనిది, అస్తి భాతిగా పరిణమించనిది కూటస్థము. ఇట్టి కూటస్థ నిర్ణయమే వేదాంతాతీతము. అటులైన యది అచల బ్రహ్మము.

కారణ కార్య బ్రహ్మములు నిర్గుణ సగుణములు. నిర్గుణమని పిలువబడినను త్రిగుణ బీజమందుండి, కాల ప్రభావమున యంకురించి సగుణమగును. అందువలన మాయ యెట్లు త్రిగుణాత్మకమో, బ్రహ్మము కూడా త్రిగుణాత్మకమే. ఇట్టి బ్రహ్మమును అఖండ యెఱుక యందురు. నిర్గుణ బ్రహ్మ ఘనరూపము. సగుణ బ్రహ్మ ద్రవరూపము. ఈ అఖండయెఱుక ఘన రూపమైనప్పుడు, త్రిగుణములు బీజ రూపమైయున్నవి. అఖండ యెఱుక ద్రవరూపమైనప్పుడు అందలి కేవల సత్వ గుణము కేవలపుటెఱుకయైనది. అందలి కేవల తమోగుణము మలినపుటెఱుకయైనది. సత్వ తమో గుణముల మిశ్రమముగా రజో గుణ మేర్పడి మిశ్రమపుటెఱుకయైనది. ఈ విధముగా అఖండ యెఱుక ద్రవరూపమైనప్పుడు మూడు ఖండ యెఱుకలయ్యెను.

కేవలపుటెఱుక దైవరూపము. దీనిలో ఈశ్వరత్వ మేర్పడి సూత్రాత్మ సత్తాగా నుండెను. మలినపుటెఱుక తన్మాత్రమై, పంచీకరణమై జగత్తుగా నేర్పడెను. మిశ్రమపుటెఱుక జీవ రూపమై, ముఖ్యముగా మానవులై జననమరణ, సుఖదు:ఖ, రాగద్వేషములనెడి ద్వంద్వములయ్యెను.

కేవలపుటెఱుక యందు సూత్రాత్మ సత్త క్రియోన్ముఖమై సృష్టి స్థితి లయలనెడి కార్యములను జేయుచు, జీవులను, వారి యింద్రియములను అధిష్ఠానత్వముగా ప్రేరేపించుచున్నది. ఈ ప్రేరణలనే అఖండయెఱుక ప్రభావముగా లక్షించవలెను.

మలినపుటెఱుక యందు జగత్తు పరిణమించుచు, జీవుల నాకర్షించుచు, వికర్షించుచున్నది. ఇవియే అఖండయెఱుక లక్షణము.

జీవరూప మిశ్రమపుటెఱుక యందు మానవులకు ఇష్టాయిష్టములు, అభిరుచులు కలిగి అటు కేవలపుటెఱుక యొక్క ప్రేరణలకు ప్రతి స్పందించుచు, యిటు జగత్తు చేతను, యితర ప్రాణుల చేతను ఆకర్షింపబడి, ప్రతిక్రియగా రాగ ద్వేషముల నొందుచున్నాడు. ఈ స్పందనలే అఖండయెఱుక యొక్క లక్షణము. అందువలన మానవునికి వాసన లేర్పడి, వాటి యనుభవముకొఱకు పునర్జన్మల నొందుచున్నాడు. ఎఱుకన్నా, మాయన్నా ఒక్కటేనని యెఱుగక, భ్రాంతికి లోనై తాను కర్తననియు, భోక్తననియు భ్రమించుచు, బద్ధుడగు చున్నాడు. లక్ష్యార్థమైన అఖండయెఱుక లక్షణమును పై మూడు ఖండ యెఱుకలందు ఒక్కటిగాను మరియు లేనిదిగాను లక్షించినచో, మాయ మర్మము దెలిసి, ముక్తుడగును. కర్తృత్వరహితుడై, లేనివాడని నిర్ణయించినప్పుడే ఘనరూప అఖండ ఎఱుక తన స్తంభన మోహన మారణ ఉచ్ఛాటన ఆకర్షణ సామర్థ్యము జూపదు. అందలి జ్ఞానము నిర్బీజమగును. సూత్రాత్మ సత్త నిర్వీర్యమై యుడిగి పోవును. చివరకు లేకుండా పోవును. ఇదే జననమరణ రహిత పద్ధతి. చివరకేమి శేషించును? అచల పరిపూర్ణ పరబ్రహ్మ మిగులును. ఈ బ్రహ్మము పై విధములైన సామర్థ్యము జూపదు.

కం॥ **సామర్థ్యమేమి జూపదు।**
**కామక్రోదాధికములుగల యదనిశ మేబాములెఱుంగదు।**
**యితరులు। యేమనినను మారు బల్కా। దీ బట్టబైలూ।**
**దీనికి మ్రొక్కేరితర జేజేలూ। నామ రూప క్రియ నటనలన్నియు మరి।**

**యేమని యనరాక యేకమై యున్నాది, యీ బట్టబైలూ। దీనికి మ్రొక్కేరితర జేజేలూ॥**

అఖండయెఱుక పోతే బట్టబయలే. అదే అచల బ్రహ్మము. దీని యందు సృష్టి చేయవలెనను కామ (సంకల్ప) ముదయించదు. దీని

యందు జ్ఞానము, లేక చైతన్యముండదు. ఇవన్నియు ద్రవరూప యఖండయెఱుక లక్షణములు. ఇతరులు అనగా మతస్థులు దీని నెఱుగక, అఖండయెఱుక బ్రహ్మమును సత్యమని నమ్మి మోసపోదురు. కాని ఎఱుక బ్రహ్మవలేగాక, యీ బట్టబయలు నామ రూప క్రియ నటనలన్నీ మీరి, ఎఱుక లేనిదై యున్నది. అందువలన బట్టబయలు నెవ్వరెఱుగరు. అయినను అదే పరిపూర్ణము, జననమరణ రహితము. గురుకృప యుంటే చాలు, ఎఱుక వీడి ఎఱుక లేని బట్టబయలగుట సిద్ధము.

బట్టబయలు చట్టు వలె కదలకుండును. బట్టబయలే శాశ్వతము. అయినను బట్ట బయలు సత్ కాదు, అసత్ అసలే కాదు. కాని అఖండ యెఱుక సత్‌చిదాత్మ. అఖండ యెఱుక పోతే చిత్‌శక్తి నిర్వీర్యమైనది. ఇక నిర్ణయించే చిత్ లేదుకదా! కనుక శేషించిన బట్టబయలు యెఱుగ రానిది. ఎఱుక లేనిదని దేలిన చిత్‌శక్తి క్రియోన్ముఖము గాదు. అప్పుడా చిత్ ప్రకాశము నిర్వీర్యము. అందలి జ్ఞానము అక్కడికక్కడనే నిర్బీజము.

కం॥ సత్తే పరమగు బ్రహ్మము। చిత్తే జగములకునాది।
చిద్రూపము యుత్పత్తి స్థితి లయముల సంపత్తి యటంచార్యులెల్ల
బరికింతు రయ్యా। ప్రత్యక్ష మంది గురిగాంతురయ్యా॥

ఏ చిత్ జగములకు కారణమో, అది సృష్టి స్థితి లయముల సంపత్తి యగు జ్ఞానమనెడు ఖజానా. ఎఱుకబ్రహ్మము జననమరణ హేతువనియు, భ్రాంతి యనియు తెలిసినంతనే చిద్రూపములేనిదగును. ఇది లేనిదైన వెనువెంటనే సత్ చిదాత్మ యందు చిద్రూపము లేకపోగా, సత్తే పరమగు బ్రహ్మము. అయినను సత్ మిగిలినదని చెప్పే చిత్ లేనప్పుడది బట్టబయలే! దీనిని ఆర్యులు పరిశోధించి, ప్రత్యక్షమందిరి. వీరే గురువులై సచ్ఛిష్యులకు గురి జూపి యెఱుక విడిపించగల సమర్థులు. ఎఱుక వీడి, ఎఱుకలోలేని

గురువు శిష్యుల యెఱుకను విడిపించి కడదేర్చు పద్ధతి యతి రహస్యము. ఇది గురుగోప్యము.

బ్రహ్మానందము సత్‌చిదానంద బ్రహ్మ మందున్న యెఱుకానుభవము. ఎఱుకలేనిచో, ఆనందమెక్కడిది? అచల పరిపూర్ణ పరబ్రహ్మ యందు జ్ఞానముతో గూడిన ప్రకాశములేదు. గనుక, సత్ చిత్ ఆనందములే లేవు.

శ్రు॥ సచ్చిదానందహీనోయ ఏవైవాత్మా సనాతనః॥

చిత్(జ్ఞాన) రహితమైతే, ఆనందమనెడి యెఱుక యుండదు. ఎఱిగే యెఱుక లేదు గనుక సత్ సంగతి తెలియదు. ఉన్నదేదో ఉన్నది. కనుక సచ్చిదానందముగానిదే అచల పరిపూర్ణ పరబ్రహ్మము. ఇది ఆద్యంతములు లేని సనాతనము.

ఎఱుక వీడి పరిపూర్ణుడైనవాడే విహిత గురువు. శిష్యునికి యెఱుక విడిపించి, బట్ట బయలును దర్శింవజేసియా బట్టబయలు నెఱిగినయెఱుకను గూడా లేకుండా జేయును. ఇట్టి పద్ధతి మరెక్కడనూ లేదు. ఇది గురుశిష్య ఉభయ రహిత పద్ధతి. పరమపదమను మోక్షమునకీ మార్గము దుర్లభము. లక్షణయుతమైన సచ్చిష్యులకీ పరమపద మార్గ మయాచితము. ఎఱుక మిగల్చని పద్ధతి తెలిపెడి నిజప్రభోదయే కేవలజ్ఞానము.



# ఏ సాధనలేని నిజగురు బోధ

కం॥ **అంచితముగ నీలోపలి। పంచీకృతమైన మాయ పద్ధతిలోనే।**
**వంచించునెఱుక దాటుము। మించిన పరతత్త్వమదియె మితి పేరలేదు।**
**ఏవిక్తమా - గతిగానరాదు॥**

మొట్టమొదలు భ్రాంతి యెక్కడ నుండి గలిగినదో, ఆ కలిగిన దాని అవ్యక్త రూపములోనే విధముగా మాయ దాగున్నదో విచారించి, తదువరి ప్రకృతి పురుషులుగాను, ఈశ్వరుని గాను, జీవునిగాను పరిణమించుచున్నప్పుడు మాయ యందున్న త్రిగుణముల రూపము ఏ యే విధములైన భ్రమలు కల్గించుచున్నవో క్రమముగా తెలిసికొని, అదే క్రమములో తిరోగమనమై మొదట వ్యష్టి అజ్ఞానమును, తరువాత సమిష్టి ఈశ్వర జ్ఞానమును, పిమ్మట తురీయమైన అఖండ యెఱుకను దాటుకొనుచు, తురీయాతీతమై, ఎఱుక విడచి, పరిపూర్ణుడుగావలెను. పంచీకృతమైన మాయ పద్ధతిలోనే తిరిగి అపంచీకృతమైనట్టి సాధనగా పయనించవలెను. చివరకు అసంగుడైన కూటస్థ బ్రహ్మము మిగిలే వరకు అన్ని విధములైన యెఱుకలను విడచిపోవుచుండవలెను. విహితమైన గురుకృపచే జ్ఞానమనెడి యఖండ యెఱుకను వీడినచో, శేషించేది పరిపూర్ణమే.

మూలావిద్యచేత చేతన బ్రహ్మము అఖండయెఱుకరూపమై, చైతన్యముగా ద్రవరూపమై ఈశ్వరీయజ్ఞానశక్తితో గూడిన సూత్రాత్మ సత్త, క్రియోన్ముఖము కాగా, అఖిల జగత్తు నేర్పడెను. ఏమీ లేనట్టిదియు, అయినను ఉన్నదేమో తెలిసికొనే యెఱుకకు మూలముగానిదియు స్థానముగానిదియు బట్టబయలుతో సంబంధము లేకనే భ్రాంతిరూప

యెఱుకబ్రహ్మము తోచి, తుదకు జీవేశ్వర జగత్తులయ్యెను. ఇదే క్రమములో యిది లేనిదిదిలేనిదనుచు, భ్రాంతి విడచుచు, చివరకు ఉత్త బట్టబయలు యేమి లేదను వరకు క్రమముగా ఖండరూప భ్రాంతులు, యఖండరూప యెఱుక మొదలైన వన్నీ దాట వలెను. ఆ విధముగా దాటుచు నిజప్రబోధ చేత అవ్యక్తమునూహించి, నిరసించగా భ్రాంతిని సమూలముగా నిర్మూలించుకొనవచ్చును.

అజ్ఞానము నుండి విముక్తమగు వరకు అనేక సాధనలు అవసరమై యున్నవి. ఇచ్చట మనస్సు యనెడి మాధ్యమమును దాటుచున్నాము. అంతవరకు సాంఖ్య, తారక, అమనస్కములను శ్రవణ, మనన, నిధిధ్యాస పద్ధతిగాను, మహావాక్య విచారణ ద్వారా వార్తిక నిర్ణయ పద్ధతిగాను అనేక సాధనలు ఉపసాధనలు, యోగ పద్ధతులు గలవు. అమనస్కమైన పిదప, సాధకుడు నిర్వాణమై, నిర్వికల్పమై, బ్రహ్మజ్ఞాని యగుచున్నాడు.

జ్ఞానము నుండి కూడా విముక్తమగుట కొఱకు పైన పేర్కొనబడిన సాధనలతో బనిలేదు. ఎందుకనగా అవియన్నియు మనస్సుతోనే జరుపవలెను. మనోనాశ్ అయిన పిదప ఏ సాధనలేని పద్ధతి యవసరమైయున్నది.

పంచసాధనలు:-

గురువు మరియు దైవము యెడల యేకలక్ష్యం, ఏకనామం, ఏకరూపం, ఏకధ్యానం, ఏకసిద్ధాంతం పాటించవలెను.

ఉపసాధనలు:-

(1) సత్కర్మలు:-

పూజలు, స్తోత్రం, జపం, తీర్థయాత్రలు, స్వాధ్యాయం, పారాయణ, భజన, శ్రవణం, సేవ, పుణ్యకర్మలు, యజ్ఞయాగాదులు, వ్రతములు, దీక్షలు, తపస్సు, సత్సంగం, సాధుదర్శనం, శాస్త్రపఠనం, మొదలగునవి.

(2) ధ్యానం:- పవిత్ర భావన, పవిత్ర జీవనం.

(3) సాధన:- అష్టాంగయోగము, సాధన చతుష్టయ సంపత్తి.

(4) విచారణ:- అభ్యాసము, ఆరూఢము.

ఈ సాధనల మరియు ఉపసాధనల ఫలితముగా పరబ్రహ్మ స్వరూప నిర్ణయమగును. అజ్ఞానమును దాటగలరు.

త్రివిధ భక్తులు:-

(1) బాహ్యభక్తి:-

శ్రు॥ శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాద సేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం॥

అని నవవిధములు.

ఇవి యెట్లనగా భాగవత శ్రవణం చేత పరీక్షిన్మహారాజు ఏడు దినములలో ముక్తుడయ్యెను. భగవన్నామ కీర్తనం చేత తుంబురుడును, నారాయణ నామస్మరణము చేత నారదుడును ముక్తి బడసిరి. లక్ష్మీదేవి నిరంతర విష్ణుపాద సేవనం చేత, నా విష్ణువందే సాయుజ్య ముక్తి పొందెను. పృథుచక్రవర్తి శివార్చనచేయుచు ముక్తుడయ్యెను. వందనం చేత అక్రూరుడును, దాస్యం చేత హనుమంతుడును, సఖ్యము చేత అర్జునుడు మరియు ఉద్ధవుడు ముక్తి చెందిరి. ఆత్మ నివేదన వలన బలి చక్రవర్తి ఉద్ధరించబడెను.

(2) అనన్య భక్తి:-

విశ్వమందలి యేవస్తువైనను సద్గురు స్వరూపముగానే లేక భగవంతుని విభూతిగా భావించి, సద్గురువు లేక భగవంతుడు తప్ప అన్యమేదీ లేదని యుండుట. అన్యముతో సంసారబంధములేకుండుట.

(3) ఏకాంత భక్తి:-

తాను, గురువు తప్ప వేరెవరు లేరని యేకాంతుడై యుండి, చివరకు బ్రహ్మ స్వరూపమగు గురువునందు మమేకమగుట.

ఈ సాధన లన్నీ మనోపరిధిలో నాచరించి, మనస్సును దాటుట వరకే. వీటివలన అనేకత్వము, వికారము, అజ్ఞానము దొలగి, ఏకత్వము, నిర్వికారము, జ్ఞానము అనెడి లక్షణమైన బ్రహ్మమగుట సిద్ధించును. ఇది యెఱుకబ్రహ్మ జ్ఞానమని మాయ యొక్క ఒక మజిలీ చేరుటయేగాని, పూర్తిగా మాయను దాటలేదు. బ్రహ్మజ్ఞానము కొఱకు యెఱుకనే నుపయోగించుచు, యెఱుకలోనే సాధన జేసి, అఖండయెఱుకరూప బ్రహ్మమగుట జరిగెను. ఇందుకొఱకు అంగన్యాన, కరన్యాన, హృదయన్యాస మనెడి యెఱుక పద్ధతులును, షడ్విధ సమాధులను మనస్సుకు సంబంధించినవి సాధించడమైనది.

ఈ విధమైన అద్వైత సిద్ధి కొఱకు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను, బోధ, ఉపరతులను ఆశ్రయించడమైనది. భ్రాంతి రహితుడగుటకు యింత వరుకు ఈ క్రింది వాటిని సాధకుడు సాధించెను.

(i) దేహేంద్రియాది వ్యతిరిక్త లక్షణుడు.

(ii) పంచకోశభిన్నుడు

(i) దశ ప్రాణ వినిర్ముక్తుడు

(iv) షడూర్మి రహితుడు

(v) షడ్భావ వికార రహితుడు

(vi) అవస్థా సముదాయ సాక్షి

ఇంకను మానసికమును దాటుట కొఱకు తాను చేసిన సాధన లీలాగున నున్నవి.

(i) పంచభూతములతో నేర్పడిన స్థూల దేహమునకు ఆసనముల చేత శుద్ధి జరిగెను.

(ii) పంచతన్మాత్రలచే పంచీకృతమైన సూక్ష్మ దేహమునకు సాంఖ్య విచారణ చేత శుద్ధి జరిగెను.

(iii) పంచశక్తుల వలన వచ్చిన జీవుడు తారక యోగము చేత శుద్ధియయ్యెను.

(iv) పంచబీజముల వలన వచ్చిన ప్రాణము హంస విచారణ మరియు అమనస్క సిద్ధి వలన శుద్ధియైనది.

(v) పంచాధిదేవతల వలన వచ్చిన ఆత్మ నాల్గు మహావాక్యముల శ్రవణ, విచారణల వలనను, వార్తిక నిర్ణయము వలనను శుద్ధియయ్యెను.

ఇప్పుడు అమనస్కమైన జీవుడు, జీవ భావము విడచి సత్ చిత్ ఆనందుడయ్యెను. ఇదే జ్ఞానము. ఈ జ్ఞానము నుండి విడుదలగుటకు గాను, పైన పేర్కొనబడిన సాధనల వంటివి వీలుపడవు. ఏ సాధన లేని పద్ధతి యవసరమైయున్నది. శ్రీ భాగవత కృష్ణ దేశికుల వారు అట్టి పద్ధతి గురించి సెలవిచ్చిరి.

కం॥ ఏ సాధన నీకెందుకు। వీసానికి పనికి రాదు। వినుమాయయ్యా।
నే సాధులచే విన్నది। యే సాధన లేని బోధ। నెఱిగింతు పోకూ।
సాధనలందు మఱిగితే రాకూ॥
యే సాధనల జోలి యేనొల్లనది నీవు। బాస జేసితి వేనీ। పరిపూర్ణ బోధ నే।
నెఱిగింతుపోకూ। సాధనలందు మఱిగితే రాకూ॥

బుద్ధి కతీతమైన సచ్చిదానంద జ్ఞానము వలన తాను శాశ్వతముగా నుండు వాడనెడి యెఱుక యున్నది. ఎఱుక వీడవలెనన్న యెఱుకతో గూడిన సాధనలు పనికి రావు. కాని బ్రహ్మజ్ఞాని యెఱుక సాధనలందు

నైపుణ్యముతోనే బ్రహ్మమని స్థిర భావములో నుండెను. ఈ అలవాటు మాననిదే శిష్యుని చిత్ స్వరూము నుండి విడుదల చేయుటకు గురువునకు వీలుపడదు. సాధనలందు మఱిగినవాడు తిరిగి అజ్ఞానమును తనపై విధించుకొను చుండును. దీనికి కారణము బ్రహ్మయొక్క సమిష్టి బుద్ధీంద్రియము, ఈశ్వరయజ్ఞానమైన సృష్టి స్థితి లయ కారకముగానున్నది. అందువలన జ్ఞాన సముపార్జన వలన నేమి ప్రయోజనము?

కం॥ **తనయాత్మ భావమెఱుగని। మనుజుని బ్రతుకేటి బ్రతుకు।**
**మదకరి విధమౌ। ఘనమైన మోహ మృత్తిక।**
**ననువుగ తల మీద నింపు టది యేచందమురా।**
**మూఢులకెల్ల నిదియే చందమురా॥**

జ్ఞాన సిద్ధి జరిగిన పిమ్మట తిరిగి అజ్ఞానమును తనంతట తానే తనపై విధించుకొనుట ఎలాగంటే మదించిన యేనుగు శుభ్రముగా స్నానము జేసియు, మరల తనంతట తాను తనతుండముతో తన తలపై దుమ్ము నింపుకొను నట్లుగా ఉంటుంది. సాధనంటే మరల అజ్ఞానమే గనుక, యే సాధనల జోలికి వెళ్ళనని శిష్యుడు బాస చేసిన గాని, గురుమూర్తి బోధ మొదలు పెట్టనని తెలుపుచున్నారు.

బోధ మొదలుపెట్టే ముందు గురుమూర్తి యీ విధముగా సంబోధించిరి.

కం॥ **జనులారా! జనన మరణములను దొలగన్ ద్రోయ జాలు లక్షణయుతమై।**
**వినువారికి, కనువారికి। తనలా వెఱిగించు దీని। తప్పకవింటే।**
**అప్పుడె వార లెప్పుడు గంటే॥**

జనులంటే, జనించుచు, నశించుచుండువారు. అయినను వారు జ్ఞానులే. జ్ఞానము సహజమైన వారు, వారి జ్ఞానము కారణముగా సంకల్పించుచుందురు. ఆ సంకల్పములిట్లుండును.

**శ్రు॥ ఏ కోహం బహుస్యాం।**

**శ్రు॥ సో2కామయుత బహుస్యాం ప్రజాయేయేతి॥**

**శ్రు॥ ఇచ్ఛా మాత్ర ప్రభుసృష్టిః॥**

**శ్రు॥ ఏతత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్॥**

ఇట్టి సంకల్పముల వలన జనన మరణములు తప్పించుకోలేరు. ఏ శిష్యుడైతే, వీటిని తొలగించి త్రోసి వేయవలెనని, అందుకు తగిన గురువు లభించవలెనని తహ తహలాడునో, అతడే లక్షణయుతుడు.

**శ్రు॥ రోసితి మోక్షా పేక్ష। రూఢిగ వినుమీ। నీవట్టి ఆరూఢత గనుమీ॥**

ఎవడైతే అద్వైతసిద్ధి యనెడి మోక్షమును జననమరణ రహితము గాదని దెలిసి కొనునో, వాడు అట్టి మోక్షమును పట్టించుకొనడు.

ఎవడైతే ఏకంసత్, సా2హం, అయమాత్మ బ్రహ్మము, అపరోక్షాను భూతి యనెడి మోక్షములు కూడా భ్రాంతియేయని, సాలోక్యా, సామీప్య, సారూప్య, సాయుజ్య పదవుల మీద విరక్తి జెందునో, అతడే లక్షణయుతుడు. కనుక పరమపదము అనెడి ముక్తికై చేయవలసినదింకనూ గలదు. ఇక్కడి నుండి జరుగు నిజప్రబోధనే అచల బోధ యందురు. ఇదియే, యే సాధన లేని బోధ. దీనిని యింగిత మెఱిగి నిర్ణయించవలెను. గురుమూర్తికి ఆంతరంగికమైన చతుర్విధ శుశ్రూషలు జేయవలెను. గురుమూర్తికి తను మన ధనములు సమర్పించవలెను. గురువుతో నేకమగు భక్తి గలిగి యుంటే చాలు. గురువే మార్జాలకిశోర న్యాయముగా శిష్యుని కడదేర్చును. లక్షణయుతమైన శిష్యుని యొక్క బంధము గురించి చెప్పుచున్నారు మరియు అతడు సంపూర్ణ ముక్తి కొఱకు విహితమైన గురుమూర్తి కోసం నిరీక్షించుచు, దొఱకిన వెంటనే యేమి జేయునో చెప్పుచున్నారు.

కం॥ **సాధన సంపత్తియు గల। సాధకుడొక నరుడు ఘోర సంసారమునన్।**
**బాధపడలేక తన పు। ణ్యోదయమున గురుని గాంచి। యురుతర భక్తిన్।**
**శరణని మ్రొక్కి। మరిమారి యుక్తిన్॥**

ఘోర సంసార మెవరిదంటే, సృష్టి స్థితి లయములు జరుపుట, లోకాల విస్తీర్ణము జేయుట, జీవులను వారి అనుభవముల కొఱకు ఆకర్షించుట, అధిష్ఠానత్వము వహించి జీవుల యింద్రియములను ప్రేరేపించుట, సంచిత కర్మలను పంచుట, అవసరమైనప్పుడు అవతరించుట వంటివి ఎవరెవరు చేస్తూ యుంటారో అట్టి జీవన్ముక్తులది. నిరంతరము, యిట్టి లీలతో విసిగి వేసారిన బ్రహ్మజ్ఞానులు, వారి వృత్తికి సంబంధింపబడియుందురు. ఈ విధముగా బాధ పడలేని జ్ఞాని, జ్ఞానము నుండి కూడా విడుదలగుటకు గాను తహతహలాడుచుండగా, తన సుకృతము చేత నొక గురుమూర్తి లభించగా, అతడు గురుమూర్తికి అమిత భక్తితో మ్రొక్కి, తనను యుక్తిగా విడుదల జేయమని అర్థించుచున్నాడు.

ఇచ్చట సాధన సంపత్తి అనగా మునుపటి సాధనలవంటివి కాదు. లక్ష్యమును అచల పరిపూర్ణ పరబ్రహ్మకు మార్చి, ఆంతరంగికముగా సమకూర్చుకొనవలసినవి, అనగా  అతి మానసము.

(i) నిత్యానిత్య వస్తు వివేకము :

నిత్య పరిపూర్ణమును, అనిత్య పిండాండ బ్రహ్మాండములను, వాటి నిజ స్వరూపమును సద్గురు కృపచే నెఱుగుట. సాలోక్యాది పదవులు జీవబ్రహ్మైక్య జ్ఞానము అనిత్యములని యెఱిగి, పరిపూర్ణమును లక్షించుట.

(ii) ఇహాముత్ర ఫలభోగ విరాగము :

కైలాస వైకుంఠాది ధామము లనిత్యమని యెఱిగి, బ్రహ్మానందమనెడి యెఱుకను విరక్తితో త్యజించుట.

(iii) శమాదిషట్క సంపత్తి :

సూత్రాత్మ సమిష్టి మనస్సుతో జరుపు సృష్టి స్థితి లయాది ఈశ్వరీయ లీలను కర్తృత్వ రహితముగాను వాటియందు ఉదాసీనముగా నుండుటను శమమందురు.

జీవుల యింద్రియములకు అధిష్ఠానత్వము వహించుటను నిగ్రహించుటను దమమందురు.

సకల జీవుల వ్యవహారమందు వ్యాపకమైనట్టి ప్రజ్ఞానమును ఘనీభవింపజేసి యుండుటను తితిక్షయందురు.

అవిద్యా కార్యములు, మాయా కార్యములందు తనకు కలుగుచున్నట్టి బ్రహ్మానందమును ఉపసంహరించి, గురుమూర్తి జూపినగురి, గుర్తులందు, అనగా పరిపూర్ణ లక్ష్యమందు అనురక్తుడై యుండుటను ఉపరతియందురు.

మత పద్ధతికి అతీతముగా ఎఱుకను విడచుట మరియు పరిపూర్ణ లక్ష్యముగా శ్రద్ధ గలిగి యుండుటను శ్రద్ధ యందురు.

సాలోక్యాది ముక్తులపై గాక, పరమపదమును లక్ష్యమందుంచు కొనుటను సమాధానమందురు.

(iv) ముముక్షుత్వము:

ఏ విధమైన యెఱుకయైనను మోక్షముగాదనియు అన్ని యెఱుకలును భ్రాంతియేయని నిర్ణయము చేయుట మరియు బ్రహ్మమనెడి యెఱుకను కూడా వీడ సంసిద్ధుడగుటయే తీవ్ర మోక్షేచ్ఛ.

ఇట్టి సాధన సంపత్తి గల సాధకునికి విహితమైన గురువెట్లుండవలెను?

వేదక, బాధక, కామ్యక, నిషిద్ధ గురువులజేరరాదు. బోధక, వాచక, సూచక, కారణ గురువుల వద్ద జేరి జీవన్ముక్తుడగుట వరకు ఒక దశ పూర్తియైనది. ఇంత వరకు సాధనలు జరిగినవి. ఇక లక్షణయుతుడైన శిష్యునికి యే సాధన లేని నిజ ప్రబోధ చేయగల విహిత గురువు అవసరమైయున్నాడు. అతనిని వర్ణించుట యెట్లు?

**కం॥ గురుమూర్తిని వర్ణింపను దరమా, వాగ్విభుడునగు విధాతకునైనన్।**
**సరస పరిపూర్ణ సంయుత। పరుడగు నిర్గుణుడుగాక - ప్రకటింపనగునా॥**
**పరుడైన వై - షిక కంతుకైనా॥**

భ్రాంతిలోనున్న వారెవ్వరు భ్రాంతి విడచినట్టి గురువును గుర్తించలేరు. మిథ్యా జగత్తును సృష్టించే వాణి భర్తయైన చతుర్ముఖ బ్రహ్మ, యెఱుక యనెడి విషమును కంఠమునందు ధరించి మిథ్యా జగత్తును లయింపజేసెడి రుద్రుడు, భ్రాంతి పురుషులు కాదా! అట్టి వారికి కూడా ఎఱుక విడచిన పరిపూర్ణుడైన గురువుని వర్ణింప శక్యముగాదు. ఆ విధముగా గురువును గుర్తించి, వర్ణించవలెననిన అతడు కూడా ఎఱుక విడచి, పరుడై, నిర్గుణుడై, పరిపూర్ణుడై యుండవలెను. అయినను తిరిగి లేనెఱుకలో మేల్కొని మాత్రమే గుర్తించును.

పరుడై నిర్గుణుడై యున్న గురువు యొక్క తేజ మెట్లుండును?

**కం॥ కాలాకాలములందున। వాలాయము నొక్కరీతి। వ్యాపించినదై॥**
**కాలునెదుర్కొను తేజము। కాలారి సమాన గురుని - గని యుందవలెరా।**
**శరణని విజ్ఞా-పన మొందనగురా॥**

కాలమంటే వ్యష్టి మనస్సు గాని, ఈశ్వరుని సమిష్టి మనస్సు గాని పని చేయుచున్నట్టి అనుభవము. సమిష్టి మనస్సు ఆగి, నిశ్చలమైతే అకాలము. అసలు మనస్సే లేనివాడు ఎఱుకలేని వాడు, అనగా జ్ఞానమును విడచినవాడు. అట్టి వాడు కాలమును లేనెఱుకగా జూచును. కాల, అకాలములతో సంగత్వము లేని వాడై, నైపుణ్యముగా వాటిలో ఉంటూనే కాలాకాలములు లేక, ఒక్కరీతి నుండే వాడు. ఇదే పరతత్త్వము మరియు త్రిగుణ రహితము. అట్టివాడు కాలమనెడి యెఱుకను లోబఱచుకొని, జ్ఞానమును క్రియోన్ముఖము గానీయడు. అతడే కాలారి. అంతటి వాడే గురువు. అతని బ్రహ్మ తేజమునందు జ్ఞానాజ్ఞానములుండవు. అదే గురుని తేజము. అట్టి తేజము నంది పొందిన వాడు మరియు అట్టి గురువును సర్వ సమర్పణగా సేవించినవాడు, ఆ గురువుతోమమేకమై, ఎఱుక వీడును మరియు పరిపూర్ణముక్తి నొందును. మరొక అర్థములో కాలారి యనగా కాలుని జయించినవాడు, లేక మృత్యువును జయించినవాడు లేక పరిపూర్ణమనెడి ముక్తి నొందినవాడు.

కం॥ పరిపూర్ణ ముక్తి దొఱకును। స్థిరమతి గురునాజ్ఞగూడి।
సేవింపుము, యందఱయుము బ్రహ్మానందము।
నిరతము నిర్గుణమునంటి నిండి యుండుమురా।
యశ్రాంతమందె పండియుండుమురా॥

కాలారి సమాన గురుని యొక్క జ్ఞాన రహిత బ్రహ్మ తేజమునందిన శిష్యుడట్టి గురువుతో మమేకమై, తానుకూడా పరిపూర్ణముక్తుడగును. అందుకొఱకు అట్టి గురువు యొక్క ఆజ్ఞను ఔననకను, కాదనకను, అనగా లేనెఱుకతో యాంత్రికముగా పాటించుచు, చతుర్విధశుశ్రూషలుగా సేవించవలెను. గురు స్ఫూర్తితో జ్ఞాన రహిత బ్రహ్మానందమందుకొనును. అదే నిర్గుణ తేజము. ఇట్టి నిర్గుణమునంటి,

యా తేజములో తాను నిండియుండి, నిరంతరము, అందులోనె పండి పరిపక్వమై యుండవలెను. తుదకతడు పరిపూర్ణుడగును. ఇదే జనన మరణ రహితము.

గురునకు చతుర్విధ శుశ్రూష లెట్లు చేయవలెను?

(i) జీవ తనువుల నాల్గింటిని, ఈశ్వర తనువుల నాల్గింటిని నిరసించినట్టి అశరీరి గురుని జేరి, ఆ గురువువలె తాను పరమాత్మ యనెడి అష్టమ తనువుగాదని భావించుచు యా గురువుకు అంగశుశ్రూషజేయవలెను.

(ii) గురువు అశరీరి గనుక లింగాంగములు లేని వాడు. అతడికొక స్థానము లేదు, లోకములేదు. తాను కూడా తనను దేశ కాల రహితునిగా భావించుచు, యా గురువునకు స్థాన శుశ్రూషజేయవలెను.

(iii) గురుమూర్తి సూచనలను స్వీకరించుటలో యెఱిగిన యెఱుకను మిగల్చకుండా, గురువు అభావము గనుక, తాను కూడా అభావమని ఎఱుక లేక సేవించుట భావ శుశ్రూష.

(iv) అవిద్యాశబలం గనుక, గురుమూర్తి ఆత్మగా లేనివాడు. అనగా ఎఱుకబ్రహ్మగా లేనివాడు. శిష్యుడు కూడా యెఱుకబ్రహ్మము భ్రాంతియని నిర్ణయించి, బ్రహ్మమైనట్టి తాను లేనివాడని, లేమిగానున్న గురుమూర్తితో మమేక మగుటయే ఆత్మ శుశ్రూష.

ఎఱుకబ్రహ్మ భ్రాంతియని నిర్ణయించుట యెట్లు?

ఏ బ్రహ్మమైతే మహావాక్య విచారణ యందు వార్తిక నిర్ణయమయ్యెనో, ఆ మహావాక్యములనే పునర్విచారణ జేయుచు, అచల పరిపూర్ణ పరబ్రహ్మను నిర్ణయించినచో, యెఱుకబ్రహ్మము భ్రాంతి యని దేలును.

మహావాక్యములు:-

ప్రజ్ఞానం బ్రహ్మ:-

అంతరాత్మ యందున్న శుద్ధమైన ప్రజ్ఞానమే, దేహేంద్రియ ప్రాణ మనస్సులందు జేరి, వాటి వాటి స్వంత జ్ఞానము వలె ప్రకటితమగుచున్నది. వాచ్యార్థమైన ప్రకటిత జ్ఞానమును విడచి, లక్ష్యార్థమైన శుద్ధజ్ఞానమే బ్రహ్మము. ఎందుకనగా దేహేంద్రియ ప్రాణ మనస్సులు జడము, అనిత్యము, స్వయం ప్రకాశముగావు. ప్రజ్ఞానమేమో నిత్యము, చైతన్యము, స్వయం ప్రకాశము. అట్టిది బ్రహ్మమే గనుక ప్రజ్ఞానంబ్రహ్మ. ఈ విధముగా చీమ మొదలు సృష్టి కర్త బ్రహ్మ వరకు వాటి యొక్క ప్రకటిత చైతన్యమును నిరసించి, ఆధారమైనట్టిదియు, అధిష్ఠానమైనట్టిదియుయైన శుద్ధ జ్ఞానమును లక్షించినచో, నట్టి ప్రజ్ఞానమే బ్రహ్మము. పరిచ్ఛిన్న దేహోపాధులలో నుండి, నామ రూప క్రియలుగా ప్రకటితమై, అనేకమైన భేదములుగా కనబడేది అజ్ఞానము. ఉపాధుల గుణ మాలిన్యము వలన తోచెడి వికారములు ప్రజ్ఞానమందు లేవు. అందువలన బ్రహ్మము నిర్వికారము, ఏకము, అచలము.

ప్రజ్ఞానమున్నంత వరకు జ్ఞానశక్తి యుండును. అనగా మిథ్యగా జీవ ఈశ్వరజగత్తులు జ్ఞానశక్తి వలన తోచుచుండును. కారణములేనిదే కార్యముండదు. కార్యము మిథ్యయైనప్పుడు, కారణము కూడా మిథ్య కావలెను. కారణము సత్యమైయుండి కార్యము మిథ్య కాజాలదు. కార్యమందున్న దోషము కారణమునుండియే వచ్చుచున్నది. ఇది కార్య కారణ ద్వయ దోషము. సగుణ బ్రహ్మము మాయతో గూడిన వాడు గనుక యెఱుకయును, బ్రహ్మయును విడదీయరానివి. ఎఱుక భ్రాంతియైనచో బ్రహ్మయును భ్రాంతియే. కనుక ప్రజ్ఞానమనెడి బ్రహ్మ యెఱుకయే అనగా భ్రాంతియే. ఆ విధముగా ప్రజ్ఞానమనెడి అఖండ యెఱుక విడిచినగాని

భ్రాంతి వీడదు. అఖండ యెఱుక దాని మూలముతో సహా లేనిదైతే, శేషించునది పరమపదము.

అహం బ్రహ్మాస్మి:-

అహం యనెడి స్ఫురణ గల్గుట చేతనే జీవుడేర్పడి అజ్ఞానముగా అహం వృత్తితో కర్మలు జేయుచు, కర్మానుభవములనొందుచున్నాడు. అటులనే అహం బ్రహ్మాస్మి అన్నప్పుడు అజ్ఞాన వృత్తి ఆగినదేగాని, శివో2హం, సో2హం అనెడి మూల వృత్తి మిగిలియున్నది. దీనికి జ్ఞానం అని పేరు పెట్టినను దీని యందు సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణలనెడి వృత్తులు స్ఫురించుచున్నవి. "ఏకో2హం బహుస్యాం" అనెడి సంకల్పములు కలుగుచున్నవి. తిరిగి జీవో2హం అనుటగా జారిపోవుచున్నది. సకల వృత్తులుడిగినగాని ముక్తిగాదు. కనుక అహం బ్రహ్మమనెడి యెఱుకపోతేనే పరమపదము. అహంకార నిరసనైతేనే పరమపదము. ఏ చైతన్యము వలన అహం స్ఫురించు చున్నదో. అట్టి బ్రహ్మచైతన్య నిరసన జరిగితేనే పరమపదము నా2హం బ్రహ్మమే పరమపదము.

తత్త్వమసి:-

అజ్ఞానానికి కారణమైన బ్రహ్మము ప్రజ్ఞానము. అజ్ఞాన వృత్తికి మూలమైన అహం స్ఫురణ చైతన్య బ్రహ్మనుండి వచ్చుచున్నది. కనుక బ్రహ్మము చేతనయైనను, చైతన్యమైనను జ్ఞానాజ్ఞానాలకు కారణమైయున్నది. కనుక లక్ష్యార్థ బ్రహ్మము త్వం రూప యెఱుక. ఇక వాచ్యార్థమైన జీవేశ్వర జగత్తులు మిథ్యగావున, ఉన్నది పరబ్రహ్మతత్త్వమే. అది యెన్నడును జీవేశ్వర జగద్రూపము గాలేదు. అందువలన సర్వవ్యాపకమనిగాని, సర్వాంతర్యామి యనిగాని అన్నచో అట్టి బ్రహ్మము కూడా భ్రాంతియే, అనగా తత్ రూప బ్రహ్మము భ్రాంతి. తత్, త్వం ఒక్కటే

యన్నచో ఎఱుకగా నొక్కటే, మరియు భ్రాంతిగా నొక్కటే గాని భ్రాంతి లేని బ్రహ్మము అచల పరిపూర్ణ పరబ్రహ్మము. ఎఱుక ప్రజ్ఞానముగా నున్నను, అజ్ఞానముగానున్నను విడువవలసినదే. ఎఱుక అహం జీవ: అని యన్నను, అహం శివ: యని యన్నను విడువవలసినదే. వాచ్యార్థ యెఱుక భ్రాంతి అయినచో లక్ష్యార్థమైన యెఱుక కూడా భ్రాంతియే. అందువలన తత్త్వమసి బ్రహ్మము యెఱుక బ్రహ్మమే, అనగా యెఱుకబ్రహ్మ భ్రాంతి. అచల పరిపూర్ణ పరబ్రహ్మమే సర్వకాలాల యందును సర్వదేశాల యందు స్వతస్సిద్ధమై ములుగ్రుచ్చ సందు లేక చట్టు వలె కదలక యుండును.

అయ మాత్మ బ్రహ్మ :-

గురువనేక మారులు "తత్త్వమసి" యని శిష్యుని యాశీర్వదించగా శిష్యుడు అయమాత్మ బ్రహ్మయని సమాప్తియయ్యెను. తత్త్వమసి బ్రహ్మ యెఱుక గనుక, దాని ఫలితమైన అయమాత్మ బ్రహ్మము కూడా యెఱుకేయై యుండవలెను. అందువలన అయమాత్మ బ్రహ్మము సమాప్తముగాదు. సగుణానికి బీజమైన తాత్కాలిక నిర్గుణ స్థితి. త్రిగుణ రహితమే సమాప్తము మరియు అది అచల పరిపూర్ణ పరబ్రహ్మమేగాని యెఱుక బ్రహ్మముగాదు. అయినను, యెఱుకతో అయ్యేది అచలము గాదు. ఎఱుక పోతేనే మిగిలేదచల బ్రహ్మము. ఈ పద్ధతి గురుగోప్యము.

గురుమర్మముగా నెఱుకవీడి, అచల బ్రహ్మమగుటకు ద్వాదశి షోడశి యనెడి మంత్రములుగలవు. ఇవి ఎఱుక మంత్రములు గావు. మననం చేస్తే రక్షించేవిగాదు. ఉపాస్యములు గాదు. గురుకృపతో దృక్‌దృశ్య రహితమయ్యేది. దీని వివరణ మున్ముందు వివరించబడును.

నిర్గుణ వాక్యాలు:-

నేతి నేతి :-

ఇది కాదిది కాదని నిరసించు కొనుచూపోతే, మహావాక్య పద్ధతిలో మిగిలేది యెఱుక బ్రహ్మము. ఈ బ్రహ్మము కూడా కాదని యెఱుకను నిరసిస్తే మిగిలేది అచల పరిపూర్ణ పరబ్రహ్మము.

ఏకమేవా2ద్వితీయ బ్రహ్మ :-

రెండవదిలేని బ్రహ్మ స్వరూపము ఒక్కటే. స్వరూపము మాయతో గూడినది. లేని మాయ గనుక బ్రహ్మమొక్కటే. లేని మాయతో సగుణుడైన బ్రహ్మ లేనివాడే. మాయతో గూడక అసంగుడైన బ్రహ్మ మొక్కటేయైనను, తాను శాశ్వత అద్వితీయ బ్రహ్మమను జ్ఞానము యెఱుక గనుకను, అనగా సగుణము గనుక, అచల పరిపూర్ణ పరబ్రహ్మ నేనని, తానని యనడు మరియు ఉనికి ననుభవించడు. ఎఱుకే మాయ గనుక, అచల బ్రహ్మమందు మాయ యేకాల మందును లేనందున, యెఱుకకు స్థానం లేదు. ఎఱుక లేనందున బ్రహ్మమనెడి జ్ఞానములేదు. బ్రహ్మానందమనెడి యెఱుక లేదు. అవన్నియు భ్రాంతియే. అచల బ్రహ్మము అవ్యక్తము గూడా కాదు. అందువలన దానినుండి యేదీ వ్యక్తము గాదు మరియు దానిలోనికి యేదీ లయము గాదు. అందువలన అచల బ్రహ్మము యెఱుకకు మూలముగాదు. అచల బ్రహ్మమందు ములుగ్రుచ్చు సందులేనందున, యెఱుక నిలిచేందుకు స్థానము లేదు. అందువలన ఏకమేవా2 ద్వితీయ బ్రహ్మమే అచలము. కాని దానికది యెఱిగే యెఱుక లేనిదిగాన ఏకమేవా2ద్వితీయ యెఱుకబ్రహ్మ లేనిది. కనుక ఉన్నదేదో యుండి దాని యెఱుక లేనిది అచల పరిపూర్ణ పరబ్రహ్మ.

ఒక్కటియైన బ్రహ్మకు కుడివైపున మిథ్య ఈశ్వరుడు, మిథ్య జీవుడు, మిథ్య జగత్తులనెడి సున్నలను జేర్చినకొలదీ లెక్కయధికమగు చుండును. ఆ ఒక్కటైన బ్రహ్మ లేనిదైనప్పుడు జీవేశ్వర జగదుత్పత్తి లేనేలేదు. అప్పుడు సున్నలు సున్నలే. ఒక్కటైన బ్రహ్మ లేనిదని అచలబోధ జేసి, ఎఱుక బ్రహ్మయైన తనకు తానే లేడని పరబయలనెడి సున్న జూపిన, తాను యెఱుకవీడి తానే లేకపోవును. అనగా ఒకటికి యెడమ వైపున సున్న జేర్చిన ఒక్కటి విలువ అధికము గాకపోగా, యా ఒక్కటి ఉండియు లేనిదైనది. ఈ బోధ గురుగోప్యము.

కం॥ ఒంటుకు దాపల బిందొ్యక। టంటించినకొలది లెక్క యధికంబగు నా।
ఒంటుకు వలపలబిందొ్వక। టంటించిన లెక్క ఉళ్ళక్కొ గదనోయీ।
ఒంటుండీ లేందౌ గదనోయీ। తంటా తీరును జూడు దానివలనే యెఱుక।
కంటె బయలును తానుగలిగుండి తనకుళ్ళక్కొగదనోయీ।
ఒంటుండీ లేందౌ గదనోయీ॥

ఒకటి అనెడి అఖండ యెఱుకకు దాపల సున్నలనెడి మాయ చేరుచుండగా లేకనే తోచుచున్నట్టి ఖండయెఱుకలు అధికమగును. ఎఱుక లేనిదనెడి బోధగా వెలపలసున్న నంటించగా, నా ఒక్కటైన అఖండయెఱుక లేనిది కాగా, నా ఒక్కటీ లేదు. అప్పుడు దాని కుడివైపంటించిన సున్నలకు విలువే లేదుకదా! ఈ విధముగా ఒక్కటనే యెఱుక బ్రహ్మమున్నంత వరకు అన్నీ తిరిగి వచ్చుచూ అధికంబగుచునుండును. పైసా యంత యెఱుక మిగిల్చినను, అది దానికదే రూపాయంతగా పూరించుకొనును. కనుక విహిత గురుకృపచే తానులేనివాడని దెలిసి, ఆ తెలిసిన యెఱుక కూడా పోతే, ఉన్నది పరిపూర్ణమే.

ఇప్పుడు "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" యనెడి వేదాంత వాక్యమును యెఱుకబ్రహ్మ మిథ్యయని వేదాంతాతీతముగా చెప్పవలసి వచ్చినది,

మరియు తన్ను తానెఱుగని అచల పరిపూర్ణ పరబ్రహ్మమే యున్నదని తేల్చబడమైనది.

నేహనా నాస్తికించన: :-

బ్రహ్మమనెడి యెఱుకే యున్నది. ఇంతకు మించి యింకేమీలేదు అని వేదాంత వాక్యము. ఎఱుకబ్రహ్మము కూడా లేనిది కాగా, అచల పరిపూర్ణ పరబ్రహ్మమే యున్నది. ఇంతకు మించి యింకేమీలేదు అని వేదాంతాతీతము.

సర్వంఖల్విదం బ్రహ్మ :-

ఈ కనబడే దంతా బ్రహ్మమే. బ్రహ్మము తప్ప మరింకేదీ లేదు. ఇది యెఱుక బ్రహ్మమైతే, పిండాండములు, వాటిలోని అహములు, బ్రహ్మాండము, దానిలోని సమిష్టి అహము, యీ నాల్గు కలసి ఒక్కటైన అఖండ బ్రహ్మమే. దృశ్యము బ్రహ్మమే, దృక్కు బ్రహ్మమే. వాచ్యార్థమైన నామ రూప క్రియా జగత్తును విడచి, లక్ష్యార్థమైన శాశ్వత, అఖండ బ్రహ్మమును లక్షించగా అఖండరూప యెఱుకబ్రహ్మమే యున్నది. వాచ్యార్థమునునుసరించి చూచినచో నా బ్రహ్మము సర్వవ్యాపకము మరియు **"అణోరణీ యాన్ మహతో మహీయాన్"**. వాచ్యార్థము పూర్తిగా విడచి వేదాంతాతీతముగా నిర్ణయించినచో సర్వము మిథ్య, అణువు మిథ్య, మహత్తు మిథ్య గనుక యిక సర్వవ్యాపకమను దానికి అర్థముండదు. అందువలన అచల బ్రహ్మమే ములుగ్రుచ్చు సందులేక అంతటా నిండి నిబిడీకృతమై సర్వకాలాలలో ఒక్క తీరుగా స్వత స్సిద్ధమై యున్నది. కనుక దీనిని ఖల్విదమైన యనరాదు. అందువలన సర్వ ఖల్విదం యెఱుక బ్రహ్మ మిథ్య.

కం॥ **పిండ బ్రహ్మాండంబులు రెండును, యా రెంటిలోని రెండహములు, యీ।**
**ఖండములు నాల్గు కూడి। అఖండంబగు ఎఱుక రూపు। గనరా మా తండ్రీ।**
**యిది దెల్పిన ఘనుడే తలిదండ్రీ॥**

కనుక యి కనబడే బ్రహ్మమంటే అఖండ యెఱుక. అంతేగాని బ్రహ్మాండాహమును మిగల్చరాదు. అచల పరిపూర్ణ పరబ్రహ్మ లక్ష్యములో అఖండయెఱుక లేనేలేదు. అందువలన క్షరాక్షరపురుషులు భ్రాంతి. క్షేత్రక్షేత్రజ్ఞులు భ్రాంతి. జీవేశ్వరులు భ్రాంతి. దేహిదేహాలు భ్రాంతి. అష్టతనువులు మిథ్య. ఎఱిగేది, ఎఱుగ బడేదీ అంతా భ్రాంతియే. అచల పరిపూర్ణమే స్వతస్సిద్ధము.

అందువలన నిజ ప్రబోధ చేత అచల పరిపూర్ణ పరబ్రహ్మ నిర్ణయమైతే నిజగురుకృపచే వేదాంతుల నిర్ణయమమైన సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ గాని, సత్ చిత్ ఆనంద బ్రహ్మగాని భ్రాంతియని తేలును. వీటిలో నొకటి ఘనరూప అఖండ యెఱుక మరొకటి ద్రవరూప అఖండ యెఱుక. ఒకదానికి మరొకటి పరిణామము కనుక అచలముగాదు. సాధకుడైన శిష్యుడు ద్రవరూప ఖండ యెఱుకలందు అఖండ యెఱుకను గుర్తించి, అనగా "తత్" ను గుర్తించి, తత్ రహిత మొనర్చినచో అఖండ యెఱుక వీడును. అందలి జ్ఞానము నిర్బీజమగును. అట్టిది యెన్నటికిని ద్రవరూపముగాదు. అట్టి జ్ఞానాజ్ఞానాలకతీతమైన పరతత్త్వమే కేవలత్వము లేక కేవలజ్ఞానము. అఖండ యెఱుకను నిర్ణయించి, విడచుటకు యే సాధనము లేదు. గురుమూర్తిని నమ్మి మార్జాలకిశోరన్యాయముగా గురునికి సర్వసమర్పణ గావించుకొన్న లక్షణయుతమైన శిష్యుడు యెఱుక వీడును. అప్పుడదే పరిపూర్ణము. ఇదే యే సాధన లేని పద్ధతి. నిజ ప్రబోధ ననుసరించి యింగిత మెఱిగి గురుమూర్తి జూపిన బాటలో పయనించిన చాలు, శిష్యుడు కడతేరును. అయితే ముందుగా పేర్కొనబడినట్లు లక్షణయుతమై శిష్యుడుండవలెను. గురువు అశరీరియై యుండవలెను. అప్పుడే గురుడు శిష్యుండేకమై, గురుశిష్యులిద్దరును రహితమగుదురు. అదే పరిపూర్ణము. ఇది గురుగోప్యము.



# ఎఱుక - బయలు - పరబయలు

ఎఱుకన్నను, చైతన్యమన్నను, మాయన్నను ఒక్కటే. గుణ సహితమైనది యెఱుక. త్రిగుణ రహితమైనది అచల బ్రహ్మము. వ్యక్తావ్యక్తములగునది అచలముగాదు. ఎఱుక మఱపులుగాని దచలము. బీజ వృక్ష న్యాయమైన యెఱుక ఘనరూపము మరియు ద్రవరూపము. పునరావృతిగాని దచలబ్రహ్మము. ఎఱుక యేరూపములోనున్నను, లేనిదే. కొంత కాలము బీజముగానున్నను, అది అంకురించును. కొంత కాలమవ్యక్తముగానున్నను, అది వ్యక్తమగును. కొంత కాలము స్వరూప లక్షణమైనను, అది తటస్థమై చలింపజేయు చుండును. కొంత కాలము చలనశీలముకాకున్నను, కాల ప్రభావమున చలింపజేయును. సర్వకాలాలలో ఒక్క తీరుగా అచలమై, పరిపూర్ణమై, ద్వంద్వాతీతమై, స్వతస్సిద్ధమై యేదియున్నదో అదే అచల పరిపూర్ణ పరబయలని నిర్ణయము. దీనిని లక్షించిననే పరమపదము. విహిత గురువు నాశ్రయించిన శిష్యునికి మొదట లక్ష్యమైన అచలము నెఱిగించి, యెఱుకంటే భ్రాంతి యని ప్రబోధించి, తుదకు యెఱుకనెడి భ్రాంతిని విడిపించును. మిగిలేది యెఱుగరాని, యెఱుకలేని పరమపదము.

కం॥ **మొదలచలము నెఱిగించెద। విదితముగా లేని యెఱుక। వివరింతుపయిన్।**
**తుదకెఱుకను విడిపించెద। మదిలో నామాటనమ్మి। మరివింటివేనీ।**
**చంచల బుద్ధి మానుంటివేనీ। పదుగూరు నిను జూచి ఖళి శాబా సీత్రోవ।**
**కెదురూ లేదనెటట్టు యిదిగో నేజేసెద। మరివింటివేనీ।**
**చంచల బుద్ధీ మానుంటివేనీ॥**

సాధన సంపత్తి గల లక్షణయుతమైన శిష్యుడు చతుర్విధ శుశ్రూషలతో నిజగురు నాశ్రయించినప్పుడు, బ్రహ్మజ్ఞానియైన శిష్యుడు తన

జ్ఞానమును క్రియోన్ముఖము చేయనిచ్చినచో నతడి సమిష్టి బుద్ధి చంచలము. అట్టి చంచల బుద్ధి మానుటకు సిద్ధమైన శిష్యునికే తన జ్ఞానమనెడి ఎఱుక నుండి కూడా విడుదల చేయుదునని గురువు ప్రతిజ్ఞ చేయుచున్నాడు. ఈ నిజ ప్రబోధ విధానము గొప్పదని, మరియు జననమరణ రహిత పద్ధతి యిదేనని అందరు మెచ్చుకొనేటట్లు చేస్తానని గురువు నిశ్చయముగా తెల్పుచున్నాడు. ఇక్కడ మనము తెలిసికొనవలసినవి - అచలమంటే, ఎఱుకంటే, విహిత గురువంటే ఎఱుక విడిపించే పద్ధతి యంటే - యీ నాల్గును తెలియబడినప్పుడే పరమపద మార్గము తెలియును. వీటిని క్రమముగా తెలిసికొందము.

అచలము :-

కం॥ పుట్టుట గిట్టుట లేకను। పుట్టే గిట్టేటి యెఱుక పోడిమెఱుగన్।
చట్టువలె కదలకుండును। బట్టబయల్ యిట్టి దెఱిగి। భావింపదగునూ।
యెఱుక లేక సేవింపదగునూ। వట్టి యాశల చేత పట్టూ బడకను యీ।
గుట్టూ దేశికు నోట గట్టీగ దెలసూక భావింపదగునూ।
యెఱుక లేక సేవింపదగునూ॥

అచలమంటే పుట్టేదిగాదు, పుట్టించేదీకాదు. గిట్టేదిగాదు, లయం జేసేదీకాదు. ఆద్యంతములు లేనిది. అది దేనికిని అవ్యక్తముగాదు, దేనికిని బీజముకాదు. దీనియందు యెఱుక బ్రహ్మమునకు మూలము లేదు. ఇది యెఱుక నిలిచేందుకు స్థానముగాదు. కనుక యెఱుకకు వ్యతిరేకమైన బట్టబయలని అనవచ్చును. బట్టబయలెఱుగ రానిది. అయినను బట్టబయలుండజూచి, యెఱిగిన యెఱుక పోతే అదే బట్టబయలు. ఇది గురుగోప్యము. ఎఱుకలేక సేవించవలెనంటే, గురు శుశ్రూష ద్వారా, అశరీరి గురునితోమమేక మగుట. అప్పుడు యెఱుకే యుండదు. గురువే

కడదేర్చును. ఎఱుక మిగల్చని పద్ధతిగా ప్రబోధించుచు, తుదకు యెఱుకను విడిపించ గల సమర్థులైన గురుమూర్తిని దేశికులందురు.

అచల మంటే ఇంతంతని యనరానిది. వింతలు శాయనిది. సతత మొక్క తీరుగా సర్వకాలాల యందు, సర్వ దేశాలయందు నిండి నిబిడీకృతమై స్వతస్సిద్ధమైనది. దీని యందు యెఱుక లేదు. చలనములేదు. చట్టు వలె కదలక అచలమైయున్నది. త్రిగుణములు లేవు. మాయ లేదు, భ్రాంతి లేదు. సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ జ్ఞానము లేదు. ఇచ్ఛా సంకల్పములు లేవు. స్తంభన మోహన మారణ ఉచ్చాటన ఆకర్షణ సామర్థ్యము లేదు. పరమాత్మలేడు, అష్టతనువులు లేవు. పరబ్రహ్మ తత్త్వము లేదు. జ్ఞాన ప్రకాశము లేదు. చైతన్యము లేదు. అహంకారము లేదు. బింబముగాదు. ప్రతిబింబమనలే లేదు. ఓంకారముగాదు, బ్రహ్మనాదముగాదు. ఛాయగాదు, మాయ గాదు. ఇది యది యనరానిది. అట్టిదిట్టి దని చెప్పరానిది. మనస్సు వాక్కు దీనిని దెలియజాలక వెనుదిరిగిపోవును.

శ్రు॥ యతోవాచ నివర్తంతే అప్రాప్య మనసా సహ।

"బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి" గాదు. ఎఱుగదు, యెఱుగబడదు.

ఎందుకనగా బ్రహ్మనెఱిగినవాడు యెఱుక బ్రహ్మమేగాని, అచల బ్రహ్మము నెఱుగ జాలడు. ఎఱుక బయలనెడి ద్వంద్వములు గానిది. ద్వంద్వాతీతమైన బట్టబయలని యనవచ్చును. బట్టబయలని యెఱుకే పేరు బెట్టి, దానితో సంబంధము పెట్టుకొనలేకపోయెను. అందువలన యెఱుకపోతే యేది మిగులునో అదే బట్టబయలు.

కం॥ బట్టబయలనుచు దీనికి। మొట్ట మొదల్ పేరులేదు।
ముదమున యెఱుకే పుట్టి పేర్పెట్టి దీనిని। లవ్వాడలేక।

**పారిపోవునురా। కనరాదిందు, దూరానేరదురా॥**
**పుట్టిచచ్చుచు మళ్ళీ బుట్టి గిట్టుచు బుట్టి।**
**నిట్టి తిప్పల నొందు, ఎఱుకే బయలును జూస్తే।**
**పారిపోవునురా। కనరాదిందు దూరానేరదురా॥**

బట్టబయలే పరమపదము. ఎఱుక తనంట తానే పుట్టి, తనకు మూలము బట్టబయలని పేరు పెట్టింది. బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతిగా బట్టబయలందు దూరాలని తలచింది. బట్టబయలు తనకు మూలము కానందున, దూరలేక, గొడ్రాలి బిడ్డ సామెతగా, అగోచరమై, తన జ్ఞానాజ్ఞాన యెఱుక వలన పుట్టి, పెరిగి, గిట్టి, మరల పుట్టుచు, గిట్టుచు, అంతులేకుండా తిప్పలు పడుచున్నది. విహిత గురువు తన పుణ్యోదయమున దొఱికినగాని యెఱుక తనంతట తానుపోదు. ఎఱుక పోతే బట్టబయలే. అదే పరమపదం. విహిత గురువు వలన శిష్యునికి పరబయలు దర్శింపబడినప్పుడు, యెఱుక పారిపోవును. ఇది గురుమర్మము. శేషించునది పరమపదమనెడి సంపూర్ణ ముక్తి.

పరమపదమునకు పర్యాయముగా నేమని చెప్పవచ్చును?

కం॥ **పరమపదమనిన, బయలన। గురుగుహ్య, మనంతమనిన। గోప్యంబనినన్।**
**పరిపూర్ణ, మచల మనినను, తిరమనగా బట్టబయలు తెలియు మాయప్పా।**
**ఎఱుకా ఎఱుగనిదన్న, ఎఱుకా మీరినదన్న।**
**యెఱుకామరపులు లేని పరవస్తువన బయలె।**
**తెలియు మాయప్పా। యీ తెలిసీన తెలివి మానప్పా॥**

పరమ పదమన్నా, బయలన్నా, గురుగుహ్యమన్నా, అనంతమనినా, గోప్యమన్నా, పరిపూర్ణమన్నా, అచలమన్నా, స్థిరము అనిన, బట్టబయలన్నా ఒక్కటే. ఈ విధముగా తెలిసికొని, యా తెలిసికొన్న యెఱుకతో సహా

యఖండ యెఱుకను వీడవలెను. ఇక మిగిలిందే పరమపదము. కనుక ఎఱుక ఎఱుగనిది పరిపూర్ణము. ఎఱుక మీరినదన్నా పరిపూర్ణమే. ఎఱుక మరపులులేనిదన్నా, పరవస్తువన్నా బయలేనని తెలిసికో శిష్యా! ఎందుకంటే ఎఱుకంటే వ్యక్తమైన యెఱుక మరియు మరుపంటే తప్పనిసరిగా తిరిగి వ్యక్తము కాగలిగిన యెఱుక. ఈ విధముగా తెలిసిన తెలివిని కూడా మానుము అని గురుమూర్తి ప్రబోధించుచున్నాడు.

**కం॥ ఎఱుకన, మరుపనరానిది। పరిపూర్ణం బీశ్వరుడనబడె నెఱుకెఱుకన్।**
**మరచిన, జీవుండనబడు। నెఱుకచలము నెఱుగ నఱుగు। నెఱుక మరుపులున్॥**

ఎఱుక మరుపులన మరియొక అర్థమున్నది. ఎఱుకన జ్ఞానము. జ్ఞానము మరచిన యది అజ్ఞానము. కనుక జ్ఞానాజ్ఞానములు రెండును యెఱుకే. ఎఱుక మరుపులు, లేక జ్ఞానాజ్ఞానములు రెండూ వీడితే పరిపూర్ణము శేషించును. ఎఱుకన యీశ్వరుడు. మరుపన జీవుడు. జీవేశ్వరైక్య జ్ఞాన మొక్కటే గనుక యెఱుక మరుపులు రెండూ భ్రాంతియే. భ్రాంతి పోతే యివేమీ మిగలవు. ఎఱుక యున్నంత సేపు అచలము నెఱుగదు. ఎఱుకపోతే నెఱిగే దేమున్నది? కనుక పరబయలు దర్శనమైతే చాలు, ఎఱుక మరుపులు రెండూ నిల్వవు. గురుకృపతో పరిపూర్ణము నిల్చును.

ఎఱుక నిర్ణయము:

**కం॥ పిండ బ్రహ్మాండంబులు రెండును, యా రెంటిలోని రెండహములు యా।**
**ఖండములు నాల్గు కూడి। అఖండంబగు ఎఱుక రూపు కనరా మా తండ్రీ।**
**యిది తెల్పిన ఘనుడే తలిదండ్రీ॥**

బ్రహ్మాండము మరియు ఈశ్వరుడనే సమిష్టి యహము, పిండాండములు మరియు జీవులనెడి దండి యహములు, యీ నాల్గు

కూడి అఖండయెఱుక యని అందురు. మరుపందు అజ్ఞానములో పిండాండ, పిండాండాహములును, ఎఱుకందు జ్ఞానములో బ్రహ్మాండ, బ్రహ్మాండాహమున్ను గలసి యఖండయెఱుక రూపము. అహములు దృక్కు మరియు పిండ బ్రహ్మాండములు దృశ్యము. దృక్ దృశ్యములు రెండును గలసి, యఖండయెఱుకయే. బ్రహ్మ సత్యం జగన్మిథ్యయని చెప్పే గురువు గురువేకాదు. బ్రహ్మమనెడి యెఱుక కూడా భ్రాంతియే యని చెప్పే గురువే నిజగురువు. అతడే శిష్యుని అఖండయెఱుక విడిపించి, పరిపూర్ణుని జేయును. ఇది గురుశిష్య రహితమగు పద్ధతి. ఎఱుక విడిపించే వరకు గురువు మేల్కొని యుండి, తుదకిద్దరునూ యెఱుకగా లేనివారు, అనగా పరిపూర్ణమే మిగిలినది.

కం॥ ఎఱుకే దేహేంద్రియములు। ఎఱుకే వర్ణాశ్రమములు।
ఎఱుకే శ్రుతులున్। ఎఱుకే నీవును నేనును।
ఎఱుకే సతి సోదరాదు। తెఱుగుము వత్సా। నేదీర్చెద నిదిగో నీయిచ్ఛా॥
హరి హర బ్రహ్మాది సుర నర గిరి సరి।
త్తరు మృగ ముఖ చరాచరములు ఎఱుకాని।
ఎఱుగూము వత్సా। నే దీర్చెద నిదిగో నీయిచ్ఛా॥

జీవ యీశ్వర తనువులును, వ్యష్టి సమిష్టి యింద్రియములును యెఱుకే. కులములు, బ్రహ్మచర్యాది యాశ్రమములు యెఱుకే. వేదశాస్త్రాలన్నీ యెఱుకే. గురుశిష్యులిద్దరు యెఱుకే. ప్రకృతి పురుషులు, త్రిమూర్తులు, దేవతలు, నరులు, గిరులు, వృక్షములు, మృగములు, వీటితో గూడిన చరాచరములన్నీ యెఱుకే. వీటిలో ఎక్కువ తక్కువ లేదు. అన్నియు యెఱుక యొక్క రూపాంతరములే. ఎఱుకంటే జీవరూప, దైవరూప బంధమేగాని యెఱుక విడిస్తేనే పరమపదమనెడి ముక్తి. శిష్యుని పరమపదకాంక్షను తీర్చెదనని గురువు తెలుపుచున్నాడు.

కం॥ ఎఱుకే విద్యావిద్యలు। యెఱుకే ప్రణవంబు, నాద। మెఱుకే కళయున్।
యెఱుకే బిందువు, చిత్సత్తెఱుకే ఆనంద మివి నీ। వెఱుగు సద్బుద్ధీ।
నీ నా మాట లెఱుకే నిబద్ధీ॥
యెఱుకే నిర్గుణ సగుణా। లెఱుకే యెఱుకకు యంత।
యెఱుకే నేనిది యంత యెఱుగ జేసితి నీ। విట్లెఱుగు సద్బుద్ధీ।
నీ నా మాట లెఱుకే నిబద్ధీ।

జ్ఞానాజ్ఞానాలు, బ్రహ్మనాదం, ప్రణవనాదం, నాద బిందు కళలు, సత్ చిత్ ఆనందము యెఱుకే. గురుశిష్య సంవాదము, నిజప్రబోధ కూడా యెఱుకే. సగుణ, నిర్గుణ బ్రహ్మము యెఱుకే. దృక్కుకు దృశ్యముంటే యెఱుకే. దృక్కుకు దృశ్య వాసనలున్నా యెఱుకే. ఇట్టి వివరణమును నిజగురుని ద్వారా యెఱిగి యెఱుక లేనిదనియు, భ్రాంతి యనియు దెలిసి యెఱుక వీడవలెను. ఎఱిగిన ప్రబోధను కూడా మానవలెను. ఈ బోధ యారూఢమైతే చాలు.

కం॥ ఎఱుకే ఇహ పర సౌఖ్యము। లెఱుకే జ్ఞానంబు జ్ఞేయ, మెఱుకే మోక్షం।
బెఱుకే భక్తి విరక్తులు। యెఱుకే సంకల్పమని నీ। వెఱుగు సత్కీర్తి।
యెక్కడి కౌర యెఱుకా సంపూర్తి॥
ఎఱుకే జీవుండీశుడెఱుకే తదేకత। ఎఱుకే సర్వము నే గుర్తెఱిగి చెప్పితి।
యీ కీలెఱుగూ సత్కీర్తి। ఎక్కడి కౌర ఎఱుకా సంపూర్తి॥

ఏ లోకానుభవమైనా యెఱుకే. జ్ఞానమంటె యెఱుకే. జ్ఞేయమైనది జగత్తైనా లేక నిర్గుణ బ్రహ్మమైన యెఱుకే. సాలోక్యాది మోక్షము లెఱుకే. భక్తి జ్ఞాన వైరాగ్యా లెఱుకే. ఈశ్వరీయ సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ జ్ఞాన మెఱుకే. వీటి స్మృతి గల ఈశ్వరుండెఱుకే. అందుకే ఈశ్వరీయ యిచ్ఛ సంకల్పము లెఱుకే. జీవుడెఱుకే. శుడెఱుకే. జీవేశ్వరైక్యము కూడా యెఱుకే.

జ్ఞేయమైన సర్వం టెఱుకే. అది అనేకమైనా యేకమైనా యెఱుకే. అజ్ఞానపు టెఱుక, శుద్ధజ్ఞాన మనెడి యెఱుక, యీ రెండూ యెఱుక యొక్క రూపాంతరములే. గురుడీ విధముగా యెఱుకని గుర్తెఱిగి, యెఱుక నిర్ణయమును భ్రాంతిగా నిర్ణయించి తెలుపుచున్నాడు. ఎఱుకను గుర్తించే కీలు తెలియవలెను. హంస రూపములో జీవహంసయైనా, కలహంసయైనా, అచలహంసయైనా, మండలత్రయ మావల యున్న హంసయైనా, శింశుమారక చక్ర మందున్న హంసయైనా యెఱుకే. షట్చక్రములందుండి అధిష్ఠాన దేవతలుగానున్నను యెఱుకే. చక్రముల వలన ప్రేరితమై జీవ కార్యములు జేయుచున్నను యెఱుకే. జపము, అజపము యెఱుకే. ఎఱుగుచున్నను, ఎఱుగబడుచున్నను, ఎఱిగింపజేయుచున్నను, కొంత కాలము శాంతించి యున్నను, అది నిర్బీజమగు నంత వరకు యెఱుకే. ఎఱుక తననెంత మోసము జేసినను గుర్తించి నిరసించవలెను. గురుకృప లేనిదే అసాధ్యము.

ఎఱుకను గుర్తించుటకు కీలు దెలియాలని గురుమూర్తి నుడువుచున్నాడు. అందువలన యెఱుకను యెంత గొప్ప యని గౌరవించినను, అది భ్రాంతియని నిర్ణయము జేసి విడువవలెనే గాని, మోసపోరాదు.

కం॥ **ఎఱుకన్నను, మరుపన్నను, ఎఱుకకు ఎఱుకన్న, దేహియన, మాయ యనన్।**
**గురుతన, సాక్ష్యన, జ్ఞప్త్యన। స్ఫురణయనన్। ద్రష్టయనిన, చూడు మొక్కటిగా।**
**యిది లేకుంటే చూడ మొక్కటిగా॥**
**మరి చలాచలమూల మర్మ మెఱిగెటిదన్న। చూడమొక్కటిగా।**
**యిది లేకుంటే చూడమొక్కటిగా॥**

ఎఱుకంటే జ్ఞానం, మరుపంటే తాను పరబ్రహ్మమనెడిది మరచిన అజ్ఞానం ఈ రెండు యేదో యొక అనుభవాన్నిస్తున్నాయి గనుక యెఱుకే.

దేహియనబడె పరమాత్మ జ్ఞానము గనుక యెఱుకే. ఎఱుక యున్నంత సేపూ భ్రాంతిలో నున్నట్లే, అనగా యేమీ లేకపోయినా, యేదీ కాకపోయిన యేదో అయి యున్నట్లు అనుభవము. దాని పేరే మాయ. గుర్తుండెనా అది యెఱుకే. సాక్షి యనుభవం, జ్ఞప్తి, స్ఫురణ యని యెన్ని యున్నను, వాటి కాధారమైన యెఱుక యున్నట్లే. ద్రష్టలో నెఱుకున్నది. ఆధార ఆధేయము లందున్న యెఱుక ఒక్కటే. అది ద్విపాత్రము మరియు బహు పాత్రనటన. అన్నింటినీ ఒక్కటైన అఖండయెఱుకగా చూడవలెను. ఎఱుక లేకపోతే యిక చూచేదేముంది? చలనమెఱుకైనను, అచలము చలించెననినను, యీ రెండెఱుకే. కనుక చలాచలముల మర్మము దెలిసినచో భ్రాంతి వీడును. అచలము నెఱిగితినంటే భ్రాంతిపోదు. అందువలన మూలము లేని గుర్తెఱిగే శరీరం యేమీలేదని ఊరకుంటే యెఱుకకు సమాప్తి. అప్పుడదే అచలము.

కం॥ పరిపూర్ణ మెఱుక లెట్టివో। గురుముఖమున।
రెంట్ని లెస్స గురుతెఱి గెఱుకన్। సరిపుచ్చుకున్న మృషయని।
పరిశుద్ధపు బోధ యీది। పాటించి కనరా। శివరామూల పద్ధతి యిదెరా॥
నరులు కొందరు బల్కిరెఱుకాను మ్రింగి।
యీ పరిపూర్ణమయ్యే మంచెఱుగాక చెడుటాకై పాటించి కనరా।
శివరామూల పద్ధతి యిదెరా॥

కనుక ఎఱుకను, పరిపూర్ణమును - యీ రెండింటిని గురుముఖమున విని బాగుగా తెలిసికొనవలెను. ఆ విధముగా నెఱిగి, యెఱుకను కర్తృత్వ రహితముగా నెదుర్కొని సరిపుచ్చుకొనవలెను. లేనిదని గుర్తించుకొనక, లేనిదని సరిపుచ్చుకొన్నచో లేనేలేవు. ఇక చెప్పేదెవరు? ఈ బోధ శివరామదీక్షితీయమని విశేషము. ఇంకెవరి వలనగాదు. ఆ సాంప్రదాయమందు గురుగోప్యము.

కం॥ ఎఱుకతో వచ్చిన విశ్వము। యెఱుకతో జనునుగాని, నిల్వ దీ।
బయలైతే ఎఱుకతో రాదెఱుకతో బో। దెఱుక తనందేమి లేదు॥
ఇది నిశ్చయమురా। వుండుంటే యీ యెఱుకే తానౌరా॥
యెఱుకా యెఱిగిన వస్తు వెఱుకాని తెలియును।
యెఱుకా యెఱుగదు బయలు నిట్టి దట్టిది యని।
నిది నిశ్చయమురా। వుండుంటె యీ యెఱుకె తానౌరా॥

విశ్వమంటె పింద బ్రహ్మాండముల మూలము. మొదట యెఱుక విశ్వముగా తోచెను. విశ్వము బీజమైతే పింద బ్రహ్మాండములు అంకురములు. ఇవి జడ చేతనములు, చిజ్జడములు. జడములు ఉపాధులైతే చేతనము అహములుగా జీవేశ్వరులుగా సత్ అని పిలువబడుచున్నది. ఉపాధులను అసత్ అని పిల్చుచున్నారు. ఎఱుకతోనే జగత్పరిణామముగాని, ఎఱుక బయలైతే యెఱుక నిల్వదు. దానితో పాటే విశ్వము పోవును. ఎఱుక భ్రాంతి గనుక ఎఱుకందేమీలేదు. ఎఱుకకు ఎఱుకే మూలము. బయలు మూలముగాదు. బయలైతే, ఎఱుకతో రాదు మరియు ఎఱుకతో బోదు. ఎఱుక లేనిది. అది ఉన్నదైతే అదే బ్రహ్మము అయ్యేది. కాని ఎఱుక బ్రహ్మము గాదు, బయలే యున్నది. కనుక బయలే బ్రహ్మము. కాని బయలు తన్నుతానెఱుగదు మరియు యితరమును యెఱుగదు. ఎఱుక తెలిసికొనే వస్తువు ఎఱుక నెఱుగును. ఎఱుకను తెలిసికోలేని వస్తువు నెఱుక నెఱుగదు. ఎఱుకను తెలిసికోలేనిది బయలు. కనుక బయలును యిట్టిదట్టిది యని తెలిపే వారు లేరు. ఇది ఎఱుక బయలుల నిర్ణయము. గురుకృప యుంటే ఎఱుకతోనే బయలును దర్శించి, బయలును చూడగానే, దానిని యిట్టిదట్టి దనక, బయలందు తనకు మూలము లేదనియు, ఎఱుక నిల్చేందుకు స్థానం లేదనియు తెలిసి, గొడ్రాలి బిడ్డ సామెతగా తనకు మూలం లేదు గనుక బిడియపడి తనకు తానే ఎఱుక లేకపోవును. ఇది రహస్యము. ఎఱుక లేకపోతే పరమపదమే.

కం॥ **మరుపుకు తన్మాత్రలు గల। వెఱుకకు తన్మాత్రలున్న వీ రెండొకటే।**
**పరిపూర్ణమునకు లేవివి। పరిపూర్ణము యెఱుకగాదు। మరుపుగాదోయీ॥**

తన్మాత్రలు సూక్ష్మ భూతములై, పంచీకరణమై, 25 తత్త్వములతో కూడి జీవుడున్నాడు. జీవుడు మరుపు గనుక, మరుపుకు తన్మాత్రలున్నవి. ఈశ్వరుడు తన్మాత్రలతో గూడిన సృష్టిని జేయుచు, పోషించుచు, తన లీల జరుపుచున్నాడు. వ్యష్టి సమిష్టి భేదమేగాని, జ్ఞానమనెడి యెఱుక కూడా తన్మాత్ర సహితమే. తన్మాత్రలు జడము, అసత్ లేక భ్రాంతి గనుక, జీవేశ్వరులు కూడా భ్రాంతియే. పరిపూర్ణమందెఱుక లేదు. పరిపూర్ణమెఱుక గాదు. కనుక పరిపూర్ణము తన్మాత్ర సహితముగాదు మరియు పరిపూర్ణమునకు ఎఱుక మరుపులు లేవు. అందువలన జీవేశ్వరులు, జ్ఞానాజ్ఞానాలు పరిపూర్ణముగాదు. జీవేశ్వర భ్రాంతి రహితమే పరిపూర్ణము. పరిపూర్ణమందెంత వెదకినా తన్మాత్రసమితి యుండదు. అందువలన అన్ని ఖండయెఱుకల తత్త్వముగా నున్న అఖండయెఱుక వదలితే మిగిలేది పరిపూర్ణము.

బ్రహ్మ సత్యం, జగన్మిథ్య యన్నచో ఎఱుక కొంతే పోయింది. మిగిలిన యెఱుక బ్రహ్మము మరల మిథ్యా జగత్తును ఊహించును. అందువలన యెఱుక తిరిగి సంపూర్ణమగును. ఎఱుక కొంచెము కూడ మిగుల కూడదు. అప్పుడే ఎఱుకతో బాధ తెగిపోవును. ఉన్నది పరిపూర్ణమే. బ్రహ్మ సత్యమన్నప్పుడు మిగిలిన యెఱుకబ్రహ్మము జగత్తును స్వప్నతుల్యముగా జూచును. శివరామదీక్షితులవారు యా బ్రహ్మయొక్క స్వప్నమును నర స్వప్నమనిరి. బ్రహ్మ కూడా లేనిదేయని నిర్ణయమై యెఱుక వీడినవారు, వారికలలోని జగత్తును, ఆ కలలోని కలపురుషుడైన తనను కూడ మేల్కొంటే అసత్యమని తెలిసినచో, దానిని సుర స్వప్నమనిరి.

**కం॥ హరి యందు దోచు నర స్వప్నము వంటిదని నానా జనముల్।**
**సుర స్వప్నము వంటిదీ యనె స్థిరమతి శివరామదీక్షితులు ధరన్॥**

హరి యనెడి హిరణ్యగర్భుని యొక్క కల నరస్వప్నము. ఇందులో బ్రహ్మయనెడు కలపురుషుడు మాత్రము సత్యమనిరి. మిగిలిన కల వ్యవహారమంతా మిథ్య. కలగనేటప్పుడు కలలోనున్న తాను మాత్రము సత్యమేలాగునగును? కలతో పాటే తానును మిథ్యగావలె కదా! ఇట్టి ప్రబోధ స్థిరమైతే, అతడికి తోచేది సుర స్వప్నము. ఆ విధముగా స్థిరమై, అచలమైన దేశికులు శివరామదీక్షితులు. వారు చెప్పేదే నిజప్రబోధ.

**కం॥ సుర లందు దోచు స్వప్నము, హరి యందున దోచు విశ్వము।**
**ఆ సురల, హరిన్। యెఱిగిన కల విశ్వము।**
**తామఱుగవె తమలేమి నెఱిగి యతిబిడియమునన్॥**

ఒక్క సారి గురుమూర్తి చేత శిష్యునికి పరబయలు దర్శనమైతే, సురలు, హరి, విశ్వము అన్నీ భ్రాంతి యని తెలిసి క్షరాక్షర ద్వయము భ్రాంతి, ప్రత్యగాత్మ పరమాత్మ వ్యవహారము భ్రాంతి యని నిశ్చయమై తాను లేకుండాపోవును. బ్రహ్మ, పరమాత్మ, స్వరూపజ్ఞాన మనెడి యెఱుక వీడి పరమపదమగును. అతనికి అతనితో సహా కలలో దోచిన వేలాగో అలాగే యని నిశ్చయమై, పరమపదమే మిగులును.

**ఎఱుక విడిపించుటెట్లు?**

**కం॥ ఎఱుక తనకుదా విడిపో। దెఱుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్।**
**గురుడొక్కడు తప్ప। గురునకు పరిచర్య యొనర్చి బోధ పద్ధతి వినినన్॥**
**తిరిగిరాని పద్ధతి గనినన్। పరిపూర్ణ యెఱుక యేర్పఱచ నెఱుక లేక హరిని।**
**స్వప్నముగన్న కరి మ్రగ్గి నట్లవు। యీ పద్ధతి వినినన్। తిరిగిరాని పద్ధతి గనినన్॥**

ఎఱుక పోగొట్టుకొనే సాధన యెఱుకలోనే జరిగితే ఫలితముగా నెఱుక మిగిలి యుండును. అందుకే యే సాధన లేని పద్ధతి యని అన్నారు. అష్టతను నిరసన జరుగగా, పరమాత్మగా కూడా లేని అశరీరి గురువు ఒక్కడు మాత్రము శిష్యుని యెఱుక విడిపించును. ఇంకెవరి చేతను గాదు. అశరీరి గురునికి అంగ, స్థాన, భావ, ఆత్మ శుశ్రూషలు చేయుటలోనే యెఱుక విడిచే రహస్యమున్నది. గురునికి అంగము, స్థానము, భావము, ఆత్మ లేవు. అట్టి గురునికి, అవన్నీ లేని పద్ధతిలో శుశ్రూషజేసినట్టి శిష్యుడు, ఆ గురుని లేని ఎఱుకలోనికి మేల్కొల్పును. ఆ గురునితో మమేకమై, తాను యెఱుకను కోల్పోవును. అదే పరిపూర్ణము. తిరిగి యెఱుక తలెత్తదు. ఇది యెట్లగుననిన, ఏనుగు నిద్రించుచున్నప్పుడా యేనుగు యొక్క కలలో సింహమును దర్శించెనేని, ఆ యేనుగు నిద్ర నుండి మేల్కొనకుండానే, కలలోనే చచ్చును. అట్లే పరబయలును దర్శించిన శిష్యుడు, తన నర, సుర స్వప్నముల నుండి మేల్కొనకుండానే చచ్చును అనగా యెఱుక వీడును. ఇక మేల్కొనడు. తాను యెఱుక వీడానని తనకు తెలియదు. ఇది యెట్లనిన, మేల్కొన్నవాడు నిద్రలోకి జారిపోవునప్పుడు, తాను వేకువానుభవమును కోల్పోవుచున్నాడని యెఱుగడు. నిద్రించినప్పుడది నిద్ర యని కూడా యెఱుగడు. అదే విధముగా ఎఱుక వీడిన శిష్యుడు, ఎఱుక వీడినట్లును, పరమపదమైనట్లును యెఱుగడు. ఏదైనా యెఱిగెనా, యెఱుక ఉండెను కదా? అది పరమపదమెట్లగును? అందుకే దీనిని గురుగోప్యమన్నారు. అశరీరిగురుని యెట్లు గుర్తించ వీలగును? కొన్ని విత్తనములను తప్తము జేసి మంచి విత్తనములలో కలిపిన, అన్నీ ఒక్కటిగానే కన్పించును. మంచి విత్తనములు మొలకెత్తును. కాని తప్త బీజములు మొలకెత్తవు. అదే విధముగా గురువు అందరి వలెనే యుండును. అతని నుండి ఎఱుకోద్భవముండదు. కాని లేనెఱుకలో నుండును. గుర్తించ వీలుకాదు. ఆ గురువునకు పునరావృతి లేదు. అయినను లక్షణయుతమైన

శిష్యునికి అట్టి గురువు అప్రయత్నముగా లభించును. పరబయలైన గురువు శిష్యునిచే, తన తహ కారణముగా లేనెఱుకలోనికి మేల్కొల్పబడి, యా శిష్యుని కడతేర్చును.

కం॥ **గురుపాద తీర్థమను హ్ర॥ త్సరసిని జలకంబులాడి।**
**సద్గురు శేషాత్కరవస్తు భోజనంబున।**
**పరితృప్తిని బొందు వాడే భక్తుడగునన్నా। కృతకృత్యుడౌ - ముక్తుడని విన్నా॥**

గురుపాదం తెలియాలంటె బ్రహ్మ పాదములు తెలియాలి. వేదాంతం ప్రకారము మూడు వంతులు బ్రహ్మము అచలమనియు, ఒక్క పాదము సృష్టియై, అందు బ్రహ్మము సగుణమయ్యెనని తెలియబడింది. అయినను, ఆ ఒక వంతు కూడా నిజముగా సృష్టి జరుగలేదు, అంతా మిథ్యయనియు, ఉన్నది అచల పరిపూర్ణమేనని నిర్ణయము.

శ్లో॥ **నకృత్స్న బ్రహ్మ వృత్తి: సాశక్తి: కింత్వేకదేశ భాక్।**
**ఘట శక్తిర్యధా భూమౌ స్నిగ్ధ మృద్యేవ వర్తతే॥**
**- వేదాంత పంచదశి 2అ-54**

మాయాశక్తి ఏకదేశీయమై యుంటుంది. బ్రహ్మ మందంతటా యుండదు. పృథివియందున్న మన్నంతాకుండలకు తగినదికాదు. కుండగా తయారగుటకు పనికి వచ్చే మన్ను కొంతే యుంటుంది. అలాగే త్రిగుణాత్మక మాయ కొంతే యుంటుంది. మిగిలిన బ్రహ్మము త్రిగుణ రహితము మరియు అచలము.

శ్లో॥ **పాదోఽస్య, సర్వ భూతాని త్రిపాదస్తి స్వయం ప్రభః।**
**ఇత్యేకదేశవృత్తి త్వం మాయా యావదతి శ్రుతిః॥**
- వేదాంత పంచదశి 2 అ-55

విశ్వమంతా ఒక్క పాదమే, అనగా నాల్గవ వంతే! మిగతా మూడు వంతులు స్వయం ప్రకాశ రూపంలో నుంటున్నది. ఈ మూడు పాదాల బ్రహ్మము పరబయలు. ఒక్క పాద బ్రహ్మము మాత్రము యెఱుక బ్రహ్మము. అనంతమైన బ్రహ్మమునకు పరిమితు లేర్పఱచి, మూడు, ఒకటి యని పాదములుగా, లేక వంతులుగా చెప్పుట సరికాదు. అంతా అచల బ్రహ్మమే స్వతస్సిద్ధమైయున్నది. ఏకదేశీయమైన త్రిగుణాత్మక మాయ యెఱుకను లేకనే తోచునట్లు జేసెను. అదే మాయా శబలిత బ్రహ్మము లేక యెఱుకబ్రహ్మము. ఇక్కడ గురుపాదమనగా, అచల బ్రహ్మమైనట్టి గురువు లేనెఱుకలో ఒక పాదము శిష్యుని కొఱకు అందుబాటైనది. హృదయ స్థానము శుద్ధ యెఱుకకు మూలము. గురుపాద తీర్థమనగా జ్ఞానశక్తి క్రియోన్ముఖముగానట్టి చిత్ప్రకాశము, లేక ప్రమాదముగాని లేనెఱుక. ఇట్టి తీర్థమునందు శిష్యుడు తన హృదయమను సరస్సులో జలకములాడుట యనగా గురువుచే విడువబడిన ప్రమాద రహిత యెఱుకను శిష్యుడు స్వీకరించి, అతడు కూడా తన స్వంత యెఱుక వీడి గురు విచ్చిన యెఱుకతో నుండుట. తనకు తాను లేనివాడుగా నుండుట. అనగా గురువే మిగిలి యుండుట. చతుర్విధశుశ్రూషలతో శిష్యుడు గురువులో మమేకమై, తన్ను తాను కోల్పోవుట. శిష్యుని జ్ఞానశక్తి నశించును. శిష్యుడు జ్ఞానమనెడి యెఱుక వీడును. ఉపాధియున్నంత వరకు గురువు యొక్క యెఱుకే తన యెఱుకగా నుండును. ఈ విధముగా, గురుని బ్రహ్మతేజము ఏ పాదము నుండి ప్రకాశించుచున్నదో, దానిలో మమేకమై తిరిగి రానివాడుగా, శిష్యుడు లేకపోవడము. ఇట్టి అర్హత గల సచ్ఛిష్యుడే భక్తుడు. అట్లు జరుగుటయే నిజమైన ముక్తి లేక పరమపదము.

గురువు ఎవరంటే జ్ఞానాజ్ఞానాలను మీరినవాడు, క్షేత్ర క్షేత్రజ్ఞులకు అసంగుడు. క్షరాక్షర పురుషులకావల పురుషోత్తముడని పిలువబడును. ఇది కూడా ఉన్న యెఱుకలో కాదు, లేనెఱుకలో. జ్ఞాన స్మరణ, జ్ఞాన

విస్మరణలని రెండు పద్ధతులుగా తిరిగే వాడు కాదు. నాల్గు జీవతనువులుగాదు. విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు గాదు. ఈశ్వరుని నాల్గవ తనువైన పరమాత్మ యనెడి తురీయముగాదు. తురీయాతీతమే గాని, దానిని వర్ణించలేము. అందువలన దేహికాదు, అశరీరి యనవచ్చును. మేల్కొన్నట్టి గురుని తేజము పిండ బ్రహ్మాండముల యందు వ్యాపించినప్పటికిని, అసంగము. శిష్యుని యుద్ధరించుటకే యిట్టి గురు తేజము, లేక యీ గురుపాదమున్నది.

ఇట్టి గురువు దొఱికేదే అరుదు. పరబయలైనట్టి గురువును శిష్యుడు మేల్కొల్పితేనే పైన వర్ణించిన గురుపాదము దొఱుకును. ఆ పాదతీర్థ మనెడి గురుతేజము శిష్య హృదయములో నిండి సర్వస్వ శిష్యుని తడిపి, ముంచి వేయును. ఎఱుక మాలిన్యము శిష్యునికి తొలగి గురువు శిష్యుడను భేదము చెరిగిపోవును. గురుడే యుండి, శిష్యుడు లేకపోవును. మేల్కొల్పిన శిష్యుడు లేడు గనుక, గురువు పరబయలై యుండును. శిష్యుడు గురువుతో సహా ఒక్కటైన పరబయలే. అనగా యెఱుకగా జూచినట్లైతే గురు శిష్యులిద్దరూ లేరు. పరిపూర్ణమే శేషించినది.

ఎఱుకోద్భవమెట్లు? ఎఱుక యెట్లు పోవును? ఎఱుకకు మూలమేమి?

కం॥ **మేలుక సుషుప్తిలోపల। మేలీలం తనకు దాను యేతెంచునో।**
**గుర్తా లీల బయలు లోపల। వాలాయము తనకు దానే వచ్చునో యన్నా।**
**వచ్చి, హెచ్చి, చచ్చునోయన్నా॥**
**యీ లోపలనె బట్టబయలున్న దెఱిగితె। యే లోకమున నిల్వజాల।**
**దెఱుగకుంటె వచ్చునోయన్నా। వచ్చి, హెచ్చి, చచ్చునో యన్నా॥**

సుషుప్తి నుండి మెలకువకు వచ్చే విధముగా నెఱుక తనంతట తాను, ముందుగా లేకపోయినను ఎలా వచ్చునో, అదే విధముగా బయలు

కెట్టి సంబంధము లేకున్నను, ఎఱుక తనకు తానే వచ్చును. ఆ విధముగా వచ్చి, హెచ్చి, లేకుండా పోవును. పోయెనన్న, అదిపోలేదు గాని వాసనా రూపముగా నున్నది. నిర్వాసనైతే ఎఱుక పుట్టదు. బయలెప్పుడు ఎఱుక కార్యముల కెట్టి సంబంధము లేక స్వతస్సిద్ధమై యున్నది. నిర్వాసన యనగా ఈశ్వరీయ జ్ఞాన స్మృతిని లేకుండా జేయుట. కాని వాసన లేక సంచిత కర్మరాశి లేక మాయ యున్నంత వరకు ఎఱుక వచ్చి, హెచ్చి, చచ్చి మరల వచ్చి, హెచ్చి, చచ్చుచుండును. అంతులేక పునరావృతమగుచుండును. గురుకృప చేత బట్టబయలున్నదని యెఱిగితే, యెఱుక యే లోకానుభముగాను యుండదు. ఎఱుకకు మూలముగానిది, ఎఱుక తనయందు నిల్చుటకు స్థానముగానిదియైన బట్టబయలే యున్నదని తెలియగా, అందు ములుగ్రుచ్చ సందు లేదని కూడా తెలియబడగా, ఎఱుక భ్రాంతియే యనియు, లేనిదనియు నిర్ణయమైన వెనువెంటనే ఎఱుక తనంతట తానే మాయ మగును. శేషించునది బట్టబయలే. అదే పునరావృతి లేని పరమపదము.

కం॥ **మూలము లేకనె వచ్చిన। నీ లీలలు జూచుకొని నీవె మురుతువు।**
**ఈ బయలున్నదనుచు దోచితె నీ లేమిని నీ వెఱింగి నిలువవు కుఱ్ఱా॥**

ఎఱుకకు మూలములేదు. ఎఱుక కెఱుకే మూలము. ఆ యెఱుకకు మూలము లేదు. తోచి వచ్చిన యెఱుక ఈశ్వరీయ జ్ఞానముతో తనలీలకు తానే మురియుచు, ఎఱుకను మరల మరల ఎఱుకలోనికి తెచ్చునటుల కొనసాగుచున్నది. జీవరూప యెఱుక నుండి ముక్తి పొంది దైవరూప యెఱుకలో స్థిరమగుచు, ఎఱుకను యెఱుకే పోషించుకొనుచున్నది. సంపూర్ణముగా నెఱుక విరమించుకొంటేనే యెఱుకకు ముగింపు. అదే పరమపదము. ఎఱుకకు మూలముగానిది, యెఱుకకు ఆశ్రయమివ్వనిది బయలు. అట్టి బయలున్నదని యెఱుకకు వార్తిక నిర్ణయమైనచో నెఱుక

పారిపోవును. ఎఱుక జాడ తెలియదు. ఎఱుక తన లేమి తనమును గొడ్రాలి బిడ్డ సామెతగా తెలిసికొని, తనకు తానే ముగించుకొనును. శేషించినది పరమపదము.

కం॥ **జలధి జలచరము లోపల గలదా, జలరాశిలోని జలచరముల వలెన్।**
**జలధి నిత్యము। జలచర మట్లుచల చలముల। సరణుల గనుమీ॥**

సముద్రమందున్న జలచరముల మాదిరి బట్ట బయలందెఱుక యున్నది. సముద్రము జలచరములకుత్పత్తి, స్థితి లయములకు కారణముగాదు. జల చరముల యుత్పత్తికి జలచరములే కారణముగాని సముద్రము గాదు. జలచరములు వాటికవే నశించును గాని, సముద్రము చంపదు. అటులనే ఎఱుకే ఎఱుకను పుట్టించును. ఎఱుకే చచ్చి పుట్టుచునుండును. మధ్యలో నెఱుకే సంసారము జేయును. బట్టబయలున కెట్టి సంబంధము లేదు. బట్టబయలును తన కాధారమని భ్రమపడి బట్టబయలును బ్రహ్మమనిన, ఎఱుక మిగిలియే యుండును. అందువలన పరమపదముగాదు. కనుక ఎఱుకంటే చలనము, బట్టబయలు అచలము. ఈ విధముగా వార్తిక నిర్ణయము జేసికొనుము.

కం॥ **జలరాశికి పుట్టవుగద। జలచరములు, వాటికవ్వె జనియించుగదా।**
**కలకాల మిట్లు బయలెఱుకల గాంచిన, సంశయంబు। కడకేగు జుమీ॥**

కలకాలము బట్టబయలే నిత్యము, ఎఱుకకు మూలముగాదనియు, ఎఱుకే తనకుదావచ్చిపోవుచున్నదని భావించుము. బయలెఱుకల రెంటిని జలరాశి, జలచరముల మాదిరి జూచుచు, ఎఱుక అచలముగాదనియు, బట్టబయలు అచలమనియు చచ్చేవరకు, నిదుర వచ్చేవరకు భావించుము. ఎఱుక బ్రహ్మము శాశ్వతమనెడి భ్రాంతి తొలగి, సకల సంశయములు దీరిపోవును. ఎఱుకే సంశయము. ఎందుకనగా

కో2హం అనెడి ప్రశ్నకు సో2హం అనెడి జవాబుదొఱుకు వరకు యెఱుకే. బట్టబయలంటే సంశయము దీరి నాహంబగుట. అప్పటికది ఎఱుకకు ముగింపు మరియు బట్టబయలే మిగిలియున్నది.

అచల పరిపూర్ణ పరబయలు:-

అచల పరిపూర్ణ పరబయలు అని మూడు పదములు ఒక్కటిగానెందుకు చెప్పవలెను? ఎదో యొక్కటి చెప్పిన చాలదా? మనము యీ మూడు పదములను ఒకే అర్ధముగా నుపయోగించుచున్నాము. నిజమునకు యెదో యొక్కటి చెప్పిన మాత్రమున నిర్ణయించిన యర్ధము తెలియబడదు. అది యేలాగంటే, ఎఱుగబడేదున్నంత వరకు యెఱుకే. ఎఱిగేదుంటే అది యెఱుకే. ఎఱుగబడే దృశ్యమునకు ఆధారము దృశ్య వాసన గల్గిన దృక్కు. కనుక దృక్కు నిర్వాసనయైతే దృశ్యము లేదు. కనుక దృక్కునే సంస్కరించి, యాదృక్కును లేకుండా జేయవలెను. అప్పుడు యెఱుకపోతే మిగిలేది బయలు. ఎఱుక శూన్యమైతే బయలున్నదని తెలియును. తెలిసినది గనుక బయలనెడి యెఱుక యున్నది. ఎఱుక బయలు రెండూగానిదియు, బయలిట్టిదట్టిదనే ఎఱుకకూడా లేనిదియు, పరబయలు. అనగా బయలుకు పరమైనది పరబయలు. పరబయలంటె ఎఱుక పుట్టేందుకు మూలముగానిది. ఎఱుకకు ఆశ్రయ మివ్వనిది. ఒక దృష్టాంతరమును తీసికొందము. బయలంటే చెట్టు చేమలేని బహి: ప్రదేశము. ఇచ్చట బహి: ప్రదేశ మెఱుగబడుచున్నది. కనుక బయలని యూరకుంటే చాలదు. ఎందుకంటే ఎఱుక మిగిలి యున్నది. కనుక పరబయలనవలెను. పరబయలులో శక్తియున్నదా? తాను యేమీ లేదన్నను, యితరమునకు కారణమా? కారణము గాని, శక్తి గాని, చైతన్యము గాని యేప్రభావము జూపనిదిగా కూడ యయియుండవలెను. కనుక చలనము లేని, చలనశీలత లేని

దొకటి యుండవలెను. దానినే అచలమందురు. అయస్కాంతము తాను కదలకుండా, యినుప ముక్కను కదిలించును. కనుకే కదిలించే చైతన్యము లేనిదచలము. నూదంటురాయి యెఱుగ బడుచున్నది. కనుక అది పరబయలుగాదు. కనుక అచలము, పరబయలు యని రెండును కలిపి యున్నచో వార్తిక నిర్ణయమగును.

సకల చరాచర జగత్తున కధిష్ఠాన బ్రహ్మమును పరిపూర్ణమని వేదాంత నిర్ణయము. అధిష్ఠాన బ్రహ్మము బీజాంకుర న్యాయమున యెఱుకయే గనుక, పరిపూర్ణమనిన యెఱుకే. కాని పరిపూర్ణమనిన ఒక్కరీతిగా నుండు శాశ్వతత్వము మరియు రెండవది జేర్చుకొన లేనిది లేక రెండవదానిగా, తననుండి వేరు జేయలేనిది. భ్రాంతికి మూలము గానిది. వేదాంతాతీత నిర్ణయముగా ఎఱుక లేని పరిపూర్ణమనియు, చలనములు లేని పరిపూర్ణమనియు చెప్పవలసివచ్చును. కనుక అచల పరిపూర్ణ పరబయలని వార్తిక నిర్ణయము. అందువలన పరమపదమనిన, పునరావృతి లేనిది. అది అచలము, పరబయలు, పరిపూర్ణము అని ఒక్క పదముగానే చెప్పవలసి వచ్చినది. కేవలమచల మన్న బండ్రాయి. అది పరమపదము గాదు. కేవల పరబయలన్న లేమితనము. అది పరమపదము గాదు. కేవల పరిపూర్ణమన్న యెఱుక బ్రహ్మము. అది పరమపదము గాదు. చలనములుండరాదు. ఎఱుక యుండరాదు. అది బ్రహ్మమై యుండవలెను. అదే పరమపదము. కనుక పరమపదమనగా అచల పరిపూర్ణ పరబయలు. ఆయా సందర్భాన్ని బట్టి ఏదో ఒక్క పదమునుపయోగించినను, కవి హృదయమేమనగా నది అచల పరిపూర్ణ పరబయలే. మాటి మాటికినీ యీ మూడు పదములను కలిపి చెప్పుట సులభము గానందున పాఠకులు ఒక్కటిగా గ్రహించవలెను.

ఈ విధముగా అచల పరిపూర్ణ పరబయలనే పేరు ఎఱుకే పెట్టింది. ఎఱుక వీడడానికికొక లక్ష్యము కోసమీ పేరు పెట్టబడినది. జలచరములు సముద్రమును తెలిసికొని సముద్రమెట్లు కాజాలవో, ఎఱుక అచల పరిపూర్ణ పరబయలును తెలిసికొని, అచల పరిపూర్ణ పరబయలు కాజాలదు. అనగా "బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి" పద్ధతి కుదురదు. ఎందుకంటే యెఱుక మిగిలియుంటున్నది. ఎఱుక వీడితేనే పరమపదము. గురువు యొక్క సహాయము లేనిదే ఎఱుక వీడదు. ఆ గురువు ఎఱుక వీడి పరమపదమై, శిష్యుని కొఱకు లేనెఱుకలోనికి మేల్కొని, శిష్యుని ఎఱుక విడిపించును. ఇది గురుగోప్యము.



# పరమ పదము

పరమపదమంటే సాలోక్యాది ఎఱుకతో గూడిన ముక్తులకతీతము. చలన బ్రహ్మ నుండి విడుదలకాగా మిగిలియున్న అచలము యెఱుకకు మూలము గానిది. ఎఱుక నిలిచేందుకు స్థానముగానిదైన పరబయలు. వెరసి పరమపదమనగా అచల పరిపూర్ణ పరబయలు. జ్ఞానాజ్ఞానాలు పోయిన పిదప శూన్యానికి మీరినది పరమపదము.

జీవోహం, శివోహం, సో2హం గానిది. అహం బ్రహ్మగానిది, చిదానందబ్రహ్మ గానిది. ప్రజ్ఞానరూప ఎఱుక గానిది, త్వం, తత్ లనెడి యెఱుక లేనిది. అయంరూప యెఱుక సమాప్తముగాదు. ఎఱుక వీడి తిరిగి తలెత్తకపోతే యేది మిగిలియున్నదో అదే పరమపదము.

శ్లో॥ యస్యాంతర్నాది మధ్యం। నహికరచరణం। నామగోత్రం న సూత్రం।
నో జాతిర్నైవ వర్ణం। నభవతి పురుషో। నా నపుంసో నచ స్త్రీ।
నా2కారం నైవికారం। నహి జనన మరణం। నాస్తి పుణ్యం న పాపం।
నోతత్త్వం తత్త్వమేకం। సహజ సమరసం। తత్ పరమం నమామి॥

ఆదిమధ్యాంతరహితం, చేసేది కాదు. చలించేది కాదు. చేయించేదీ కాదు. నడిపించేది కాదు. పేర్లు, చిరునామాలు లేవు, పురుషుడు, స్త్రీ, నపుంసకముగాదు. ఆకారాలు, వికారాలు లేనిది. పుట్టని చావనిది. పాపపుణ్య ఫలితముగానిది. తత్త్వము కాదు. ఏకంకాదు. ఉన్నదని అనరాదు, లేదని యనరాదు. అందుకే తత్త్వాతీతం లేక పరతత్త్వం. అది పరమం, పరమపదము. ఇదే సిద్ధాంతం. నీవనెడి, నేనడి యెఱుకలేదు. ఇన్ని విధముల నిర్ణయమైనది. దృక్కుగా మూలం లేనిది మరియు దృశ్యముగా ఉత్త బట్టబయలు. దానినే అచలమని, పరిపూర్ణమని, పరబయలని నిర్ణయిస్తే అదే పరమపదము.

పరమపద నిర్ణయము, పరమపద మార్గము తెలిపేదే చలాచల బోధ. ఈ పద్ధతిలో వేదాంత మార్గములో అజ్ఞానమును విడచి, వేదాంతాతీతముగా జ్ఞానమును విడువవలెను. అజ్ఞానము విడచి, బ్రహ్మ జ్ఞానియైన వాడు జ్ఞానమును కూడా విడువవలసి యున్నదని యెవ్వడెఱుగునో అతడే లక్షణయుతమైన శిష్యుడు. ముందుగా అజ్ఞానికి అచలబోధ చేయరాదు. లక్షణయుతముగాని జ్ఞానికి కూడా అచలబోధ చేయరాదు. "మొదలచలము నెఱిగించెద"నని కృష్ణ దేశికులు చెప్పారని అజ్ఞానికి జెప్పిన, అతడు నాస్తికుడగును. లక్షణయుతమైన జ్ఞానికి ప్రబోధించిన యెడల అతడు పరిపూర్ణుడగును. అందువలన వేదాంత బోధ వలన జీవన్ముక్తుడైన సాధకునికి అంత వరకు అచల బోధ రహస్యము. పిదప వేదాంతాతీతముగా బ్రహ్మను, మాయను, కేవల జ్ఞానమును, పరమపదమనెడి ముక్తిని పునర్విచారణ గావించవలెను మరియు రహస్యమును విప్పి జెప్పవలెను.

దీనికి వేద ప్రమాణము కూడా యున్నది.

శ్లో॥ **జ్ఞానా త్సంజాయతే2ఆనందం। ఆనందం భ్రాంతి లక్షణం॥**

జ్ఞానం వలన ఆనందమనెడి యెఱుక పుట్టును. ఆనందం కూడా భ్రాంతియే. కనుక ఆనందమును విడువవలెను.

శ్లో॥ **సత్యం జ్ఞాన మనంతం చ। మాయా గుణ మితి శ్రుణు॥**

సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ యనెడి స్వరూప లక్షణము నిజానికి త్రిగుణములకు బీజ స్థితి. ఇది మాయ లక్షణం. అనగా అచల పరిపూర్ణము గాదు. ఆనందం ఎఱుకే గనుక పరమపదముగాదు. స్వరూప లక్షణ బ్రహ్మము యెఱుకకు మూలము గనుక పరమపదము గాదు.

ఇందులో సత్ చిత్ ఆనందమనెడిది ద్రవరూప అఖండయెఱుక మరియు సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ ఘనరూప అఖండయెఱుక. ఇంత కంటే ఏమీ లేదు. ఎఱుక యున్నది గనుక పరమపదము గాదు.

శ్లో॥ **జ్ఞానమానందం నాస్తి। ఇతి వేదాంత నిశ్చయః॥**

జ్ఞానం, ఆనందం అనేవి లేవు. ఇదే వేదాంత నిర్ణయము. అనగా యెఱుక యేనాడు లేదు. ఉన్నదంటే అది భ్రాంతి. అందుకే అది లేనెఱుక. అందువలన సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ యనెడి ఎఱుక అవ్యక్తమైతే, అది మూలావిద్య ప్రభావము వలన శబలితమై సత్ చిత్ ఆనంద మనెడి యెఱుక బ్రహ్మమయ్యెను. మూలావిద్య రహస్యము దెలిసినచో, అవిద్యా శబలిత బ్రహ్మము లేదని నిర్ణయమగును. మాయను దాటుటకిది ఆఖరి హద్దు. ఈ హద్దు దాటితే అచల పరిపూర్ణ పరబయలే. అదే పరమపదము.

సారాంశవేమనగా బ్రహ్మము ఆనందించుట వలన విశ్వమేర్పడినది. ఆనందం నాస్తి గనుక బ్రహ్మానందము లేదు. సాయుజ్య ముక్తి బ్రహానందమే గనుక పరమపదముగాదు. బ్రహ్మానందము వలన పునరావృతి యున్నది, గాన పునరావృతి లేనిది పరమపదము.

ఎఱుక విడచుట :-

ఒక్కటైన ఘనరూప యెఱుకయే యున్నది. అది ద్రవరూపమై ప్రధానముగా మూడు ఖండ యెఱుకలయ్యెను.

(1) కేవలపుటెఱుక (2) మలినపుటెఱుక (3) మిశ్రమపుటెఱుక.

కేవలపుటెఱుక కేవలసత్వ గుణప్రధానముగా నేర్పడి సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ క్రియా సామర్థ్యము గలిగి క్రియోన్ముఖమైనప్పుడా క్రియలు జరుగును. ఆ క్రియలన్ని జీవరూప మిశ్రమపుటెఱుకపై ప్రేరణ

జూపును. కేవల తమోగుణ ప్రధానముగానేర్పడిన జగత్తును మలినపుటెఱుక యందురు. జీవుల కర్మ వాసనలనుసరించి, యీ జగత్తునుండి ఆకర్షణ వికర్షణలు ఆయా జీవులకు కలుగును. సత్వగుణ తమోగుణముల మిశ్రమము చేత యేర్పడిన రజోగుణమే జీవుడు లేక మిశ్రమపు టెఱుక. ఈ జీవుని మీద దైవ శక్తుల ప్రేరణ వలన జగత్తుతో బంధము కలుగును. అందువలన జీవునికి మంచి చెడులు, ఇష్టాయిష్టములు, అభిరుచులు కలుగును. వాటి క్రియా రూపమే జీవుని కర్మ. పూర్వ కర్మానుసారము నడచుకొనుచు, క్రొత్త కర్మను ప్రోగుచేసి కొనుచుండును. ఇదియే అజ్ఞానము. అందువలన పునర్జన్మలనొందును. ఈ మూడు ఖండ యెఱుకలందును అఖండ యెఱుక పై పేర్కొనబడిన లక్షణములతో గుర్తింపబడుచున్నది. ముఖ్యముగా జీవుడు వీటిని తెలిసికొని, తన కర్మానుసారమైన ప్రతిస్పందనను, ప్రతిచర్యను నిలుపుదల జేసికొనవలెను. వైరాగ్య బోధ ఉపరతుల చేత, అఖండ యెఱుక లక్షణముల నధిగమించవలెను. జీవుడు మిశ్రమపుటెఱుక నుండి విముక్తుడైనప్పుడు అజ్ఞానము తొలగినది. జీవన్ముక్తుడైన జ్ఞాని కేవలవుటెఱు కానుభవములోనున్నాడు. ఇది పరమాత్మ స్థితి. ఈ స్థితి యందు సూత్రాత్మసత్త పరమాత్మగా పని చేయుచుండును. జీవుల యింద్రియములపై అధిష్ఠానత్వము వహించి, జీవులను ప్రేరేపించుచుండును. జీవులకు ఉపాధిని సృష్టించి పోషించును. సంచితములను పంచి ప్రారబ్ధానుభవము నొందించుచుండును. చివరకు లయింప జేయుచుండును. ఇట్టి క్రియలను ఆపినప్పుడు, తన సామర్థ్యము సూత్రాత్మసత్తగా నుండిపోవును. సత్తా క్రియోన్ముఖమగుననిన, యది అఖండయెఱుక ప్రభావమే. ఇచ్చోట ఈశ్వరీయజ్ఞానమైన సృష్టి స్థితి లయములు కూడా భ్రాంతియని అఖండయెఱుక వీడిన, జ్ఞానము కూడా హరించును. ఈశ్వరీయ కార్యము లేనప్పుడు జీవ సృష్టి యుండదు. తాను

బ్రహ్మగా కూడా నుండడు. ఇదే తిరిగిరాని ముక్తి లేక పరమపదము. ఈ విధముగా సూత్రాత్మ సమిష్టి మనోనిశ్చలతను మరియు సూత్రాత్మ యందున్న చేతనను నిశ్చేష్టిత మొనర్చుటను సాధించుట వలన అఖండ యెఱుక వీడును. అనగా అది ఘనమై తిరిగి ద్రవరూపమవదు. దీనికే నిజప్రబోధ యవసరమైయున్నది. నిజ గురువు రహస్యత్రయ మంత్రములనుపదేశించి, పరబయలు దర్శింపజేసి యెఱుక విడిపించును. ఎఱుక విడిపించు పద్ధతి గురుగోప్యము.

రహస్యత్రయ మంత్రములు :-

ద్వాదశాక్షరి :-

ఏతన్మిథ్యా శుద్ధ వియత్కించి నాస్తి:
ఈ ఉత్త బట్ట బయలు ఏమీ లేదు.
దృశ్య రూపమైనదేదీ లేదు. అంతా ఉత్త బట్టబయలే అని యర్థము.

షోడశాక్షరి :-

నిర్మూలమేతదా జ్ఞానాచ్ఛరీరం నాస్తి కేవలం.
మూలం లేని యీ గుర్తెఱిగే శరిరం ఏమిలేదు.

దృక్కురూపమైన గుర్తించే శరీరం ఏమీ లేదని యర్థము. ఉన్నదంటే అది భ్రాంతి. సర్వ దృక్కు బ్రహ్మయని యందుమూ, దానికి మూలం లేదు. అందువలన లేకనే తనకు తానే తోచింది.

ఈ రెండు మంత్రాలు తిరిగి స్థూల ద్వాదశి, సూక్ష్మ ద్వాదశి, కారణ ద్వాదశి, మహా కారణ ద్వాదశి యనియు, స్థూలషోడశి, సూక్ష్మషోడశి, కారణషోడశి, మహాకారణషోడశి యనియు ప్రబోధ సౌలభ్యము కొఱకు విభజింపబడి చెప్పబడినవి.

దృశ్యానికి కారణం దృక్కునంటియున్న వాసనలే. స్థూల రూప దృశ్యము లేవీ లేవని తెలిసిన దృక్కు వాసనల నుండి విడుదలైతే దృశ్యములేని దృక్ను లేదని యనవచ్చును. ఈ విధముగా ముందు స్థూల దృశ్యములు లేవని చెప్పేది స్థూలద్వాదశి. అందువలన స్థూలరూప దృక్కుకు మూలం లేదని చెప్పేది స్థూలషోడశి. కాని సూక్ష్మముగానున్న ప్రేరణలున్ను దృక్కున్ను యున్నవను భ్రాంతి కొనసాగుచున్నది. సూక్ష్మద్వాదశీ మంత్రము వలన సూక్ష్మరూప దృశ్యములు లేవనియు, సూక్ష్మషోడశి వలన సూక్ష్మము నెఱిగే దృక్కుకు మూలం లేదనియు విడుదల జరిగినది.

వాసనలు కారణము గనుక వాసనా రూపమైనదేదీ లేదని చెప్పేది కారణద్వాదశి. అందువలన వాసనల కాశ్రయము గాని దృక్కు లేదని చెప్పేది కారణషోడశి. అయినను, మహాకారణము వలన వ్యష్టి కారణములుత్పన్నమగుట వలన, యవి దృక్కును గుర్తింపజేయుచున్నవని సందేహము. మహాకారణద్వాదశి వలన, అది కూడా ఉత్త బట్టబయలు యేమీ లేదని, మహాకారణమైన సంచితరాశికి ఆశ్రయమైన దృక్కు కేవల దృక్కుగా నున్నాడనియు, కాని యాదృక్కు కూడా మూలం లేని గుర్తెఱిగే శరీరమేనని నిషేధించుచున్నది.

స్థూలద్వాదశి, స్థూలషోడశిల వలన అన్నమయ పురుషయోగము జరుగును. త్రిమూర్తిత్వమభావమగును. విరాట్పురుషుడు హిరణ్యగర్భునిలో విలీనమగును. తనది యనుకొన్న దృశ్య జాలమంతా బయలై తత్సంబంధమైన దృక్కు బయలైయుండును.

సూక్ష్మద్వాదశి, సూక్ష్మషోడశిల వలన ప్రాణమయ పురుషయోగము జరుగును. సూత్రాత్మ సామర్థ్యముడిగిపోవును. అనగా సూత్రాత్మ సత్త క్రియోన్ముఖముగాదు. హిరణ్య గర్భుడు అవ్యాకృతునిలో విలీనమగును. ఎఱుకే బయలు రూపమై, తన్ను తాను బయలుగా జూచుకొనును.

కారణద్వాదశి, కారణషోడశిల వలన మనోమయ పురుషయోగము జరుగును. మూలా విద్య స్థితి గల్గును. కారణమైన వాసనలను ప్రత్యక్షముగా దర్శించి, వాటిని లేనివిగా జూచుకొనును. కారణము నశించగా అవ్యాకృతుడు తురీయుడైన పరమాత్మలో విలీనమగును. అనగా విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు లేకపోగా, యా లేని వ్యాపారమునకే సాక్షిత్వమగును అందువలన సూత్రాత్మ యొక్క సమిష్టి మనస్సు నిశ్చలత నొందును. లోపలా, వెలుపలా దృక్కు యనెడి యెఱుక బయలై గాన్పించును.

మహాకారణ ద్వాదశి, మహాకారణ షోడశిల వలన విజ్ఞానమయ పురుషయోగము జరుగును. సూత్రాత్మ సమిష్టి మనస్సు నిశ్చలమైనందున చైతన్యము యా మనస్సును కదిలించలేక యూరకుండును. పర్యవసానముగా ద్రవరూప అఖండయెఱుక ఘన రూపమై యుండిపోవును. పరమాత్మ స్థితి లేకపోవును. పై వరుస క్రమములో భ్రాంతి తొలగిపోయినది. అందువలన విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత పరమాత్మలు లేకపోయెను. అవి లయమై, పునరుత్పత్తి యయ్యే విధముగా గాక, యనగా ఆధార ఆధేయ పద్ధతిగా గాక, ఒక్కటొక్కటి వదలిపోయెను. ఇది నిరపేక్ష పద్ధతి. అందువలన ఘనరూప అఖండయెఱుక తిరిగి ద్రవరూపము గాదు. ద్రవరూపమయ్యెనా, ఖండ యెఱుకలై జీవ ఈశ్వర జగద్భావనలు పునరావృత మగును. నిజమైన జననమరణ రహితము గావలెనన్నచో, ద్వాదశీ, షోడశీలను గురుముఖముగా దెలిసికొని, నాల్గు పురుషయోగములు తన యందు జరుగగా సంపూర్ణముగా ముక్తుడగును. తిరిగిరాడు. ఏ విధమైన యెఱుక లేకపోగా, తాను పరిపూర్ణ మనెడి యెఱుక గూడా యుండదు. అచల పరిపూర్ణ పరబ్రహ్మయనగా ఉన్నదేదో యున్నది, లేనిది లేనే లేదు. ఎఱుక వీడినందున యెఱుగబడదు. అదే పరమపదము.

పంచదశాక్షరి:-

**స్వప్నే ప్రతీయ మానాని రూపాణి యథాతథా॥**
**కలలో దోచిన శరీరా లెలాగో అలాగే.**
**కర్పూరదీప సంయోగం జ్యోతిరూపం యథాతథా**
**కర్పూరకణిక అగ్నితో కూడితే యేలాగో అలాగే.**

తాను దృక్కు గానున్న యనుభవమున్ను, తనకు దృశ్యమగుచున్న అనుభవమున్ను ద్వాదశీ మంత్రము షోడశీ మంత్రముల వలననూ మరియు ఇంతకు ముందే జరిగిన ప్రబోధ వల్లను, లేనిదని నిర్ణయమైనది. గురుమూర్తి యెఱుక విడిపించే వరకు తాను దృక్కుగా మిగిలియే యున్నాడు. అన్ని భ్రాంతులూ తొలగినప్పటికిన్ని మరియు మిగిలియున్న తనను కూడా భ్రాంతియని నిర్ణయము జేసినప్పటికిని యెఱుక విడువలేకపోవుచున్నాడు. ఇది కేవలము సాధకుని యొక్క సందేహము. సందేహమున్నదని తనకు తానే తెలిసికోలేని స్థితి కూడా. అందువలన పంచదశాక్షరీ మంత్రము కావలసివచ్చెను. లేకుంటే ద్వాదశాక్షరీ మరియు షోడశాక్షరీ మంత్రములు సరిపోయెడివి.

కలలో తోచిన దృశ్య జాలమంతా భ్రాంతియైనప్పుడు కలలో యాకలకు కథానాయకుడుగా నున్న తాను మాత్రము సత్యమేలాగవుతాడు? మేల్కొన్న పిదప, కలలోని తన ప్రవర్తన మరియు అనుభవములు కూడా అసత్యమే కదా! మేల్కొన్నప్పటి స్థితియే సత్యమగును. అలాగే కర్పూర ముద్దను అగ్ని హరించగా, ముద్ద ఖర్చైపోగా, అగ్ని కూడా ఆరిపోవును. అలాగే అజ్ఞానం పోగానే జ్ఞానం కూడా విడచును. సందేహ నివారణ కొఱకు పంచదశాక్షరీ మంత్రము చెప్పవలసి వచ్చినది. వివరణ చేయుటలో కొంచెమే యైనను సందేహ నివారణ చేయుటలో చాలా ముఖ్యమైనదీ మంత్రము. ఎందుకనగా సందేహమున్నంత వరకు యెఱుక వీడదు.

అద్వైత సిద్ధి జరుగు వరకు పై మూడు మంత్రములు రహస్యము. పిదప బ్రహ్మానుభవ మనెడి అఖండయెఱుక వీడుటకు నీ రహస్యమును విప్పిజెప్పవలెను. ముందే వివరించినచో ఖండ యెఱుకలు తొలగునేమోగాని, అఖండయెఱుక వీడదు. మీదు మిక్కిలి నాస్తిక వాదము తలెత్తును. అందువలన అచల బోధ రహస్యముగా నుంచవలసివచ్చినది. కనుకనే యీ అచల బోధకు, అద్వైత బోధకున్న ప్రాచుర్యము లభించలేదు. పైగా అచల గురుమూర్తి లక్షణయుత శిష్యునికి మాత్రమే బోధించుమని చెప్పుచున్నాడు. పైగా, యే సాధన జోలికి నెనొల్లనని బాసచేసిన గాని చెప్పననెను. సాధనలందు మరిగితే రాకు యని తేల్చి చెప్పెను. ఇన్ని కారణముల చేత కేవల అచల బోధకు ప్రాచుర్యము లేదు. కనుకనే చలాచల బోధయనెడి పేరున, యీ రెండు సిద్ధాంతములను, వేద ప్రమాణముగానే సమన్వయము చేయవలసి వచ్చెను. ఈ కాలపు మానవుల మేధస్సు ననుసరించి అచలమును చలాచల పద్ధతిలో చెప్పినప్పుడు, నిజమైన జననమరణ రహితమును తెలిసికొనగలరు.

గురు గోప్యము:-

ఏ సాధన లేని బోధ గనుక మనన నిధిధ్యానల ద్వారా పరిపూర్ణమునందలేరు. మనస్సును దాటిపోవు వరకే సాధనలు. అతిమానసమందు చైతన్య నిరసన జరుగవలెను. నిజప్రబోధ శ్రవణమైనప్పుడు శిష్యుని యొక్క ఇంగిత జ్ఞానము చేత వార్తిక నిర్ణయము జరుగవలెను. బ్రహ్మజ్ఞానియైన లక్షణయుతమైన శిష్యుడు గట్టి పడినట్టి అఖండయెఱుకను, పలుచనజేసి, చివరకు లేకుండా జేయవలెను. ఇది గురుకృపవల్లనే జరుగవలెను. ఇది ఏ విధముగా జరుగునన్నదే గురుగోప్యము. ఇది రహస్యమైనను, కొంత మేరకైనా అవగాహన యగుట కొఱకు అనుభవజ్ఞుల స్ఫూర్తితో వివరించుటకు ప్రయత్నము

చేయుచున్నాము. ఇది యింతకుముందు పుస్తక రూపములో యెక్కడను లభించలేదు. అనుభవమునే యిచ్చట పొందుపఱచుచున్నాము. ఇతరుల యనుభవముతో సరిపోల్చతగదు. ఎవరి యనుభవము వారికి సత్యమే.

చేయవలసినదేమంటే గురువు ప్రబోధించినట్లుండటమే. గురువు పరీక్షించిన దానికి "ఎఱుక-అచల" పద్ధతిలో నిలబడవలెను. గుర్వాజ్ఞ పాటించవలెను. తను మన ధనములు సమర్పించి, శరణాగతి పొందవలెను. తనువనగా పరమాత్మ తనువు. మనస్సనగా సూత్రాత్మ సమిష్టి మనస్సు. ధన మనగా సూత్రాత్మ సత్త వలన క్రియోన్ముఖమైనట్టి జీవ ఈశ్వర జగత్తులు. వీటిపైన ఆసక్తి వీడవలెను. వేద ప్రమాణాలకు బంధింపబడరాదు. శిష్యుడేమి చేసినను, జ్ఞాపక ముంచుకొన్నను, యెఱుక వీడదు. అందువలన ఊరక యుండవలెను. గురువే శిష్యునేమి చేయవలెనో చూచుకొనును. శిష్యునికి వెంట్రుకవాసి యెఱుక మిగుల్చును. ఈ యెఱుక గురువు ననుసరించుట కొఱకు మాత్రమేనున్నది. శిష్యుని తాను తన యెఱుకను విడచుచున్నప్పుడు కాలము, అకాలము, విశ్వ రహస్యము, మూలావిద్య మర్మము మొదలగునవి తన వెంట్రుక వాసి యెఱుకకు తెలియబడుచుండును. ఇది మార్జాల కిశోర న్యాయముగా జరుగును.

ఎఱుక విడిపించు క్రమమీలాగున యుండును. శిష్యుడు సచ్చిదానంద బ్రహ్మము. అయినను యా యెఱుకను నిజప్రబోధ వలన నిరసించి యున్నాడు. గురువు పరబయలైయున్నాడు. అట్టి గురువేమియు చేయజాలడు. అందువలన తన యెఱుకనెవ్వరు విడిపించునోయను శిష్యుని తహ లేక ఆర్తి పరబయలైనట్టి గురువును లేనెఱుకలోనికి మేల్కొల్పును. ఈ గురు తేజమందు జ్ఞానశక్తి నిర్బీజమై యున్నది. అందువలన మేల్కొన్న గురువు యెఱుకబ్రహ్మము వలె సృష్టి స్థితులకుపక్రమించడు. శిష్యునిది కూడా బ్రహ్మ తేజమే. గురుని బ్రహ్మ

తేజము శిష్యుని యందు జేరి, శిష్యుని జ్ఞానమును పరివర్తన జేయును. ఆ శిష్యుని తనతో మమేకము జేసికొనును. ఇక గురువే ఉన్నాడు. శిష్యుడు లేడు. శిష్యుడు లేడు కనుక, గురువును మేల్కొల్పే ప్రక్రియ ఆగిపోయినది. అందువలన గురువు తన లేనెఱుకను కోల్పోవును. తిరిగి పరబయలుగానుండును. గురువు పరబయలై యుండుటే సహజము. శిష్యుడు గురువు యందు మమేకమై యుండెను గనుక శిష్యుని యెఱుక వీడును.

**గురుడు శిష్యుండేకమాయెను, కులము గోత్రము లేకపాయెను.**
**కుడీయడములు సమమె అయెను, గురు తెఱుకబాయెన్॥ ఆత్మా మేలుకొనవే॥**

గురువు యందు శిష్యుడు మమేకమై గురు శిష్య భేదము తొలగిపోయెను. నేను మేనుల సంధిలో పుట్టిన గుర్తు లేకపోయెను. అనగా కారణముతో సహా నశించెను. ఆత్మయే నేననెడి గుర్తు. ఆత్మయే చిత్‌యనెడి గుర్తు. చిత్ యనెడిదే యెఱుక.

కనుక ఎఱుకనెడి గుర్తు మిగుల లేదు. ఇదే ఎఱుక నుండి మేల్కొలుపు. ఇక్కడ మేల్కొల్పుయనగా అచలము. ఎందుకనగా ఎఱుకనెడీ కల తమస్సనెడి నిద్రలో కదా వచ్చేది! మేల్కొంటే కల లేదు. కల, లేక భ్రాంతి రహితమే అచలము. ఆత్మనగా యెఱుక బ్రహ్మము. అది భ్రాంతి. ఆత్మ మేల్కొంటే ఆత్మలేదు. అచలమేయున్నది. ద్వాదశితో కల దృశ్యము పోయెను. షోడశితో కలపురుషుడనెడి దృక్కుపోయెను. పంచదశితో సందేహము దొలగెను. గురుకృపతో నెఱుక వీడెను. అదే పరమపదము.

సచ్ఛిష్యునికి అశరీరి గురుమూర్తి పరబయలు జూపినప్పుడు, పరబయలిట్టిదట్టి దనక, గురువు జూపిన గురి, గుర్తులతో, నా

పరబయలందు తనకు (ఎఱుకకు) మూలము లేదని తెలిసి గొ(్రాలి బిడ్డ సామెతగా, తాను లేనని నిర్ణయమైన వెనువెంటనే తాను లేకపోవును. ఇదే గురుమర్మము.

ఎఱుకపోతే యేమగును? తోచు వృత్తులు తొలగిపోవును. భ్రాంతి మూలము నశించును. ఉచ్ఛనీచంబనెటి మాటలుత్తవైపోవును. విన్న కన్న బోధలు లేకపోవును. భూతపంచకము శూన్యమగును. ఎఱుక బయలైై యేమీ మిగులదు. ఉన్నవన్నీ కలలో తోచినవేలాగో అలాగే. జరిగేదంతా పిల్లలాటల పోలికే. పిండ బ్రహ్మాండంబులందున్న వ్యష్టినేనులు, సమిష్టి నేనుతో సహా వాటి తెలివి యెగిరిపోవును. జననమరణ భయము తొలగును. వ్యష్టి సమిష్టి యింద్రియములు చలించవు. త్రిగుణములు మునిగిపోవును. అష్టతనువులడవిబట్టును. ఆ తనువుల అహంకారము అణగిపోవును. అశరీరి మిగిలిపోవును.

భాగవత శ్రీ కృష్ణ దేశిక ప్రభువరుండిటురానె వచ్చెను।
వేగ గని తనుమనధనంబులు వీడి। శరణనవే॥

పైన పేర్కొన్న విధముగా తనువు, మనస్సు, ధనమును బ్రహ్మమనెడి శిష్యుడు వీడి గురువునకు శరణాగతి పొందవలెను.

బట్టబయలును గురుడు జూపిన। నట్టులేకను పుడమియందున।
పట్టు విడువక, గుట్టుమరువక। దిట్టమైపోవే॥

ఈ విధముగా సంసిద్ధమైన సచ్ఛిష్యునికి పరమపదము స్వతస్సిద్ధము. మూలము లేనట్టి యెఱుకను గురువు ముంచి వేయును. ఎఱుక వీడినవాడు నిర్వాసనా మౌనముద్రాంకితుడై, దక్షిణామూర్తి వలె నుండును.

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానం।
వర్షిష్ఠాన్తేవ సదృషి గణై రావృతం బ్రహ్మనిష్ఠై:॥

**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం।**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే॥**

ఎఱుక పద్ధతిలో పరబ్రహ్మానుభవములో నున్న వయోవృద్ధులైన శిష్యులు అచల పరిపూర్ణ పరబయలనెడి పరమపదమునకై దక్షిణామూర్తి నాశ్రయించి, వారును గురుమర్మముగా పరిపూర్ణులైరి.

ఎఱుక వీడిన శిష్యుడు వివరించిన నిర్ణయములను విని, శిష్యుని ఆరూఢ, ఆరూఢాతీత స్థితులకు సంతసించి, గురువు శిష్యుని గురుదక్షిణ యడిగెను. శిష్యుడు తననే సమర్పించుకొనెను. శిష్యుడు యెఱుకను సంపూర్తిగా విడచి చిత్తరువు వలె యయ్యెను.

కం॥ **అనిమెచ్చి యేమిచ్చెద। వని గురుదక్షిణ నటంచు నతడడిగిన,**
**నన్నని పల్కె శిష్యరత్నము।**
**విని యిది యిక ముట్టబోక, విహరించుమనెన్॥**

గురువు శిష్యుని యెఱుక జోలి పోవద్దని యన్న వెంటనే చిత్తరువయిన శిష్యునికి గురువు తన యెఱుకనిచ్చి, గురుస్ఫూర్తితో నడచుకొనుమని చెప్పెను. జనులలో జనులవలె మెలగమని చెప్పెను. శిష్యుడు లేనెఱుకతో, తన తుది శ్వాస వరకు మెలగి యేమీ లేక పోవును. అయినను అతడు పరిపూర్ణమే. శరీరముతో నున్నను, అశరీరి. వ్యవహరించుచున్నను యెఱుకలో నుండడు. కర్తృత్వ రహితుడై యుండును. గుర్తు, జ్ఞాపకము వంటివి యుండవు. అతడుండియు లేనివాడు. సామాన్య జనులతనిని గుర్తించలేరు. అశరీరియు గుర్తించలేడు, ఎందుకనగా అతడు పరబయలు గనుక.

## సమాప్తమ్

ఓం పూర్ణమద: పూర్ణ మిదం। పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।

పూర్ణస్య పూర్ణ మాదాయ। పూర్ణమేవా వశిష్యతే।

**ఓం తత్ సత్**

**ఓం శాంతి: శాంతి: శాంతి:**



# పరబయలు గురునికి మంగళ హారతి

మంగళము విశ్వమూర్తికి। మంగళ మచల స్వభావ। మౌనాకృతికిన్॥
మంగళము విశ్వమూర్తికి। మంగళ మచల స్వభావ। మౌనాకృతికిన్॥
మంగళము కేవలాత్మకు। మంగళ మాద్యంత శూన్య-
మహితున కిపుడు। శుభ మంగళం - విహితున కెపుడు॥ మంగళం ॥
మంగళము విశ్వమూర్తికి। మంగళ మచల స్వభావ। మౌనాకృతికిన్॥
రహిమీర బయలున। రాణించు నిజగురు।
సహజ పరబ్రహ్మ। సౌజన్య నిధికిపుడు॥ మంగళం ॥
మంగళము విశ్వమూర్తికి। మంగళ మచల స్వభావ। మౌనాకృతికిన్॥
యిహపరంబుల కందకను త। త్త్వేక్షణంబున గోచరించెడు।
కుహర కూటమరాళ గమనుడు। కోటి భాస్కర కాంతి మీరెడు-
మహితున కిపుడు। శుభమంగళం - విహితున కిపుడు॥ మంగళం ॥
మంగళము విశ్వమూర్తికి। మంగళ మచల స్వభావ। మౌనాకృతికిన్॥ 1

మంగళము నిర్వికారికి। మంగళ మపరోక్ష విహిత। మహితాత్మునకున్॥
మంగళము నిర్వికారికి। మంగళ మపరోక్ష విహిత। మహితాత్మునకున్॥
మంగళము సచ్చిదాత్మకు। మంగళమనవద్య చిద్బ్ర-
హ్మాదిదేవునకు। పరాత్పరుడౌ - వేదవేద్యునకు॥ మంగళం ॥
మంగళము నిర్వికారికి। మంగళ మపరోక్ష విహిత। మహితాత్మునకున్॥
ఆది యంత్యము లేక। నమరి చిన్మొంటను।
నాదాంతరంగుడౌ। నటన సంపూర్తికి॥ మంగళం ॥

మంగళము నిర్వికారికి। మంగళ మపరోక్ష విహిత। మహితాత్మునకున్॥
భేదబుద్ధి విరహిత రేచక। భిన్న పూరక కుంభకాఖ్య, వి।
వాద జాంతర్లక్ష్య హిమకర। వహ్ని సూర్య సురూప చిద్బ్ర-
హ్మాదిదేవునకు। పరాత్పరుడౌ - వేదవేద్యునకు॥ మంగళం ॥
మంగళము నిర్వికారికి। మంగళ మపరోక్ష విహిత। మహితాత్మునకున్॥ 2

